ఓ౩మ్

# సరళతమ సంస్కృత ప్రారంభిక

# सरलतम संस्कृत प्रारंभिका

# Saralatama Sanskrit Prarambhika


రచయిత :

పం॥ ధర్మానంద శాస్త్రి



ప్రకాశకులు :

జిజ్ఞాసు సరళతమ సంస్కృత ప్రచార సమితి

హైద్రాబాదు, ఆంధ్ర ప్రదేశ్

ఓమ్

B. Chandriah & Sons.

# సరళతమ సంస్కృత ప్రారంభిక

# सरलतम संस्कृत प्रारंभिका

## Saralatama Sanskrit Prarambhika

రచయిత :

పం॥ ధర్మానంద శాస్త్రి

ప్రకాశకులు :
జిజ్ఞాసు సరళతమ సంస్కృత ప్రచార సమితి
హైద్రాబాదు, ఆంధ్ర ప్రదేశ్

## జగద్గురువులు శ్రీ శంకరాచార్యులవారి

(కంచి కామకోటి పీఠాధీశులు)

## శుభాశీస్సులు

జిజ్ఞాసు సరళతమ సంస్కృత ప్రచార సమితి వారి సంస్కృత ప్రచార కార్యక్రమము మా దృక్పథమునకుఁ దీసికొని రాఁబడినది. వారు సంస్కృత భాషకు తద్వారా ఆర్షవిజ్ఞానమునకు చేయుచున్న సేవ చాల ప్రశంసనీయమైనది. భాషకు వ్యాకరణము వెన్నెముక వంటిది. అట్టి వ్యాకరణము సంస్కృత భాషకు భగవత్పాణిని మహర్షుల వారిచే నిర్మింపబడినది. ఆ వ్యాకరణము చాల పటిష్ఠమైనది. సర్వసందేహ నివారకమైనది. ఈ సమితి వారు జిజ్ఞాసు సరళతమ పద్ధతి ద్వారా సంస్కృత ప్రచారము గావించుచున్నారు. ఈ పద్ధతి మిక్కిలి శాస్త్రీయమైనదగుటచే వ్యాకరణాధ్యయనము సర్వజనులకు సుకరమైయున్నది. ఇది చాల ముదావహమైన విషయము.

సంస్కృతము సమస్తార్ష విజ్ఞానమునకు మూలకందమైనది మానవునికి ఐహిక పారమార్థిక సుఖానుభవమునకు వలసిన సర్వమార్గములు ఆ భాషయందు నిమిడియున్నవి. కావున పురుషార్థసిద్ధి నభిలషించు ప్రతిమానవుఁడు సంస్కృతము నధ్యయనమొనర్చి యిష్టసిద్ధి నొందవలయునని మా ఆశంస. అట్టి సత్కార్యమునకై పాటుపడుచున్న యీ జిజ్ఞాసు సరళతమ సంస్కృత ప్రచార సమితి ఇతోఽధిక దీక్షతో కృషి చేయుఁగాక యని సర్వేశ్వరుని స్మరణపూర్వక శుభాశీస్సులు.

ఓమ్

# భూమిక

'విద్యయాఽమృత మశ్నుతే'. (యజు. 40_14)

పై వేదమంత్రమునందుఁ బేర్కొనఁబడిన యమృతము సిద్ధింప వలెనన్న విద్యాధ్యయనము గావింపవలెనని భావము. ఈ లోకమున అమృతమను పదార్థమొకటి కలదనియు దానిని సేవించినవారు జరామరణ రహితులై యుందురనియుఁ జెప్పుకొనుట కలదు. కాని అట్టి పదార్థమును సేవించి అమృతులైన పురుషులెవ్వరును నేడు కానరాకున్నారు. కావున జ్ఞానమే అమృత మనియు దానిని మానవునకు ప్రసాదించునది విద్యయే యనియు మనము గుర్తింప వలెను. అందుచేతనే భర్తృహరి విద్యాప్రాభవము నిట్లు వక్కాణించిరి:

"విద్యానామ నరస్య రూపమధికం ప్రచ్ఛన్న గుప్తంధనమ్ విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః। విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరా దేవతా విద్యా రాజసు పూజ్యతే నహి ధనం విద్యావిహీనః పశుః"

అట్టి విద్యాభ్యాసమునకు దేవభాషయగు సంస్కృతము శ్రేష్ఠతమము, పరమపావనము నై యున్నది. నేఁడు సంఘములో ప్రబలియున్న భ్రష్టాచారము, అత్యాచారము, అరాష్ట్రీయ, అధార్మికత మున్నగు వాని నిరోధించుటకు సంస్కృతభాషయందు పరిణత స్థితినందియున్న 'అమరజ్ఞానమే' ఏకైక సాధనము.

"కేయూరాన విభూషయన్తి పురుషం హారా న చంద్రోజ్జ్వలా-నస్నానం నవిలేపనం నకుసుమం నాలంకృతా మూర్ధజాః। వాణ్యేకా సమ

లంకరోతి పురుషం యాసంస్కృతా ధార్యతే క్షీయన్తే ఖిల భూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్" (భర్తృహరి).

అను శ్లోకమును బట్టి సంస్కృతమైన వాక్కు మాత్రమే పురుషుని భూషితుఁజేయఁగలదు గాని తదితరమైన భూషణములు నశించును. అట్టి యీ సంస్కృత భాష తన చైతన్యమును భారతీయ భాషలన్నింటికి పుష్కలముగా సమర్పించి విరాజిల్లుచున్నది. మన భాషలన్నియు సంస్కృత బాహ్యములై జీవచ్ఛములవలె సారహీనములై పోవును. సంస్కృతమునందు పాండిత్యము నార్జించిననే కాని ప్రామాణికతయు, పరిపూర్ణతయు సిద్ధింపవు. సంస్కృతాంధ్రములకును ఇట్టి గాఢమైన సంబంధము గలదు. ఆంధ్రభాషాపాటవమునకు సంస్కృత భాషాధ్యయన మెంతయేని అవసరమని అభిజ్ఞుల అభిప్రాయము.

మనుజునకు ఏ విద్యయు నభ్యసింపనిదే రాదు. పుట్టుకతో జంతువు ఈదఁగలుగును, కాని ఎంతటి విజ్ఞానపరుడైనను ఈత నేర్వనిదే నీటినుండి సురక్షితముగ బయటఁపడడు, కావున అభ్యాసము ద్వారా విద్య నార్జింపవలయును. సర్వ విద్యలకు పురుషార్థము ప్రధానఫలము. సామాన్యులు కూడ పురుషార్థముచేతనే మహాత్ములైనట్లు చరిత్ర యుద్ఘోషించుచున్నది.

"బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడఙ్గో వేదోఽధ్యేయో

జ్ఞేయః" (మహాభాష్యం-పస్పశాహ్నికము.)

పైనుదాహరితమగు పతంజలి మహర్షి వచనము ననుసరించి ఋగ్యజుస్సామాధర్వణము లను చతుర్వేదములును, వేదాంగములైన శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను వానిని, ఉపాంగములగు ఆయుర్వేద. గాంధర్వ. ధనుర్వేద; అర్థవేదములను,

ఉపవేదములగు న్యాయవైశేషిక సాంఖ్యయోగ మీమాంసాదులను బ్రాహ్మణ గ్రంథములను ఏకాదశోపనిషత్తులను మన్వాది స్మృతి గ్రంథము లను రామాయణ మహాభారతాది ఇతిహాసములను. ఇట్టి ఆర్ష గ్రంథముల విజ్ఞానమును సర్వజనులకందజేయవలెనను సంకల్పముతో "మా జిజ్ఞాసు సరళతమ సంస్కృత ప్రచార సమితి" సార్ధ సంవత్సరకాలమునుండి ఈ నగరద్వయమునందు సంస్కృత ప్రచారమును గావించుచున్నది. మాముఖ్య లక్ష్యముచే లాభము నొందుచున్నవారిలో బాలబాలికలు, స్త్రీ పురుషులు ఉద్యోగులు నిరుద్యోగులు, ఉద్యోగ విరమణనొందినవారు వివక్ష లేకుండ విద్యార్థులగుట ముదావహము.

సంస్కృతమును సులభముగా బోధించుటకు ఆంధ్రమున మా ప్రణాళిక కనుగుణముగా ఏ పుస్తకమును గోచరింపకపోవుటచే సరళ మైన స్వబోధ, శిక్షణోపయుక్త వ్యాకరణాంశములతోఁ గూడియున్న ఈ ప్రారంభికను మిక్కిలి అనుభవముతోఁ గూర్చుటయైనది. సంస్కృత భాషను పాణినీయాష్టాధ్యాయిని పాతంజలి మహాభాష్యమును ఆధునికు లకు అతి సులభముగా బోధింపవలెనను సంకల్పముతో స్వర్గీయ పండిత బ్రహ్మదత్త జిజ్ఞాసువు (గురువు) గారు తమ విశేషానుభవముతో నల వది సంవత్సరముల కృషిఫలితముగా 44 పాఠములుగల 'సరళతమ విధి' యను నొక గ్రంథమును విరచించిరి. ప్రభుత్వమువారు వీరి సరళతమ పద్ధతిని తిలకించి గురువుగారికి రాష్ట్రపతి బహుమతిని సమర్పించి సత్క రించిరి. వీరి పద్ధతి పరిపూర్ణముగా పాణినీయమైయున్నది. మా సంస్కృత ప్రచార సమితి ప్రచారసాధనముగా నా గ్రంథము పాఠ్య గ్రంథముగాఁ గావించుకొన్నది. ఆ గ్రంథమును అనాయాసముగా అర్థము చేసికొనుటకు ఈ ప్రారంభిక తెలుఁగు వారి కెంతయుఁదోడ్పడు నని ఆశించుచున్నాము.

ఈ పుస్తకమును రచించిన పండిత శ్రీ ధర్మానంద శాస్త్రిగారికిని. తెలుఁగును సవరించి సంస్కరించిన శ్రీ శలాక రఘునాథశర్మ ఎం. ఏ. గారికిని మేమెంతయేని ఋణపడి యున్నాము. ముద్రారాక్షసములను దూర మొనర్చుటకు తోడ్పడిన శ్రీ పం॥ ఎస్. నరసింహ మరియు శ్రీ ఎల్. ఎన్. బాజిరావులకు కృతజ్ఞతాభివందనములు.

ఇయ్యది మా సమితి ద్వారా వెలువడుచున్న ప్రథమ గ్రంథము. ఎడనెడ ననేక స్ఖాలిత్యములకు ముద్రారాక్షసము కూడ కొంత తోడయి యుండవచ్చును. ముద్రణమతి స్వల్పకాలములో జరుగవలయుట అపేక్షితమైనందువలన అనేక సాధక బాధకములను లెక్కింపకుండుట బుద్ధిపూర్వకమేయని మనవి చేయుచున్నాము. దీనిని సహృదయులైన పెద్దలు మన్నింతురుగాక.

ఈ గ్రంథముద్రణమును మా సమితికి కంచికామకోటిపీఠాధీశులు జగద్గురువులు శ్రీ శంకరాచార్యుల వారు దయతో ముద్రింపచేయుటయేకాక తమ యమూల్య సందేశము నొసఁగి మమ్ములను కృతకృత్యులను గావించినందులకెంతయు ధన్యులము. సంస్కృత భాషాప్రచారము ప్రబలముగా జరిగిననాడే మన ప్రాచీన సంస్కృతి సభ్యతలు పునరుద్ధరింపఁబడఁగలవని తలఁచి శ్రీ వారు మా సమితికిఁ గావించిన ఈ మహోపకారమునకు మా సమితి వారందఱము సర్వదా కృతజ్ఞులము.

భవదీయ

దండి నరసింహా

మంత్రి

జిజ్ఞాసు సరళతమ సంస్కృత ప్రచార సమితి.

సీతాఫల్‌మండి. సికింద్రాబాద్ ఆ. ప్ర.

# ప్రార్థన

ఓమ్ సహ నావవతు సహ నౌ భునక్తు సహ వీర్యం
కరవావహై, తేజస్వి నావధీతమస్తు, మా విద్విషావహై
ఓం శాంతిః శాంతిః శాంతిః
(తైత్తిరీయ అరణ్యాకము)

సహ నావవతు—ఓ సచ్చిదానందుడగు పరమేశ్వర! మీ కృపచే, రక్షణచే, సహాయముచే మేము పరస్పరము ఒకరినొకరము రక్షించు కొందుము గాక.

సహనౌభునక్తు—మేమందరము మీ యనుగ్రహము వలన పరమ ప్రీతితో కలసి, అత్యంత నుత్తమమగు నైశ్వర్యమును-చక్రవర్తి రాజ్యాది భోగములతో నానందమును-ఎల్లప్పుడు ననుభవింతుము గాక.

సహవీర్యం కరవావహై—ఓ దయానిధీ! మీ సహాయము వలన మేమందరము పరస్పరము కలసి యొకరు ఇంకొకరి సామర్థ్యమును పురుషార్థము ద్వారా ఎల్లప్పుడు పెంపొందించు కొందుము గాక.

తేజస్వి నౌ అధీతమస్తు—ఓ విద్యాప్రకాశము నొసంగు పరమేశ్వర! మీ కృపవలననే మేము చదివినదియు, మాచే చదివింపబడిన దియు సమస్త ప్రపంచమునందును ప్రకాశించుగాక! మా సర్వ విద్యలు సదా అభివృద్ధినొందు గాక.

మా విద్విషావహై—ఓ ప్రీత్యుత్పాదక! మేము ద్వేషమును విడనాడి యెల్లరము నొకరి కొకరము మిత్రులమై యుందునట్లు దయ జూపుము.

భావము :—

గురుశిష్యులు ఒకరు ఇంకొకరి సామర్థ్యమును పురుషార్థమును సర్వదా పెంపొందించు కొనవలెనని యర్థము. పై విషయమునకై భగవంతునితో యిరువురు కలసి ప్రార్థించు మంత్రము.

ఓం

# సరళతమ సంస్కృత ప్రారంభిక

## 1. వర్ణమాలా ప్రకరణము

సంస్కృత భాషయందు అక్షరములు (త్రిషష్ఠి) అఱువది మూడు. అవి అకారాది వర్ణములయందు విభక్తములై యున్నవి. వీనిని రెండు విధములుగా విభజించిరి. (1) స్వరములు (2) వ్యంజనములు. స్వరములకు అచ్చులనియు. వ్యంజనములకు హల్లులనియు పేరు. స్వరములు మూడు విధములు.

హ్రస్వములు :- అ, ఇ, ఉ, ఋ, ఌ

దీర్ఘములు :- ఆ, ఈ, ఊ, ౠ, ఏ, ఐ, ఓ, ఔ

ప్లుతములు :- అ$_3$, ఇ$_3$, ఉ$_3$, ఋ$_3$, ఌ$_3$, ఏ$_3$, ఐ$_3$, ఓ$_3$. ఔ$_3$

అచ్చులు ఉదాత్త, అనుదాత్త స్వరిత భేదములు, అవి మరల ఒక్కొక్కటి అనునాసిక, అననునాసిక భేదములను బొందును అట్లు ఒక్కొక్క అచ్చు $3 \times 3 \times 2 = 18$ భేదములను బొందును. అకారము యొక్క 18 భేదములీక్రింది పటములో చూడనగును.

అననునాసికములు

| | | హ్రస్వము | దీర్ఘము | ప్లుతము |
|---|---|---|---|---|
| ఉదాత్తము | — | అ | ఆ | అ$_3$ |
| అనుదాత్తము | — | అ॒ | ఆ॒ | అ॒$_3$ |
| స్వరితము | — | అ॑ | ఆ॑ | అ॑$_3$ |

అనునాసికములు

| | | | | |
|---|---|---|---|---|
| ఉదాత్తము | — | అఀ | ఆఀ | అఀ3 |
| అనుదాత్తము | — | అ॒ఀ | ఆ॒ఀ | అ॒ఀ3 |
| స్వరితము | — | అ॑ఀ | ఆ॑ఀ | అ॑ఀ3 |

ఇట్టి 18 భేదములు అ, ఇ, ఉ, ఋ అను అక్షరములకు గలవు. ౡ వర్ణమునకు దీర్ఘమును, ఏ, ఓ, ఐ, ఔ లకు హ్రస్వమును లేకపోవుట వలన వీనికి ఒక్కొక్క దానికి 12 భేదములే.

## వ్యంజనములు

1. కవర్గము క ఖ గ ఘ ఙ
2. చవర్గము చ ఛ జ ఝ ఞ
3. టవర్గము ట ఠ డ ఢ ణ
4. తవర్గము త థ ద ధ న
5. పవర్గము ప ఫ బ భ మ

ఊష్మములు:- శ ష స హ

అంతస్థములు:- య ర ల వ

సంయుక్తాక్షరములు:- క్ష త్ర జ్ఞ

## అయోగవాహముల చిహ్నములు వాని ప్రయోగము

ః విసర్గము (విసర్జనీయము) ఉదా:- ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

ᳵ జిహ్వామూలీయము*ఉదా:- పురుషఃకరోతి = పురుషᳵకరోతి; బాలః ఖిద్యతే = బాలᳵఖిద్యతే.

* కుప్వోః ᳵ క ᳵ పౌ చ (అష్టాధ్యాయి 8-3-37)

| | |
|---|---|
| ⌣⌢ ఉపధ్మానీయము* | ఉదా:_ పురుషః పఠతి = పురుష⌣⌢పఠతి; వృక్షః ఫలతి = వృక్ష⌣⌢ఫలతి. |
| ం అనుస్వారము | ఉదా:_ హోతారం రత్నధాతమమ్ (ఋగ్వేదము 1_1_1) |
| | యేద్దేవానాం యజ్ఞియా (ఋ.7_3_35) |
| ౘ హ్రస్వము | ఉదా:_ దేవానా ౘ సఖ్యముపసేది మావయం (య. 25_15); |
| | 1 2 3 2 2 2 3 త్వమగ్నే యజ్ఞానా ౘ హోతాం... (సా. పపా. 1_2) |
| ౙ దీర్ఘము | ఉదా:_ ద్యౌః శాంతిర్రం తరిక్ష ౙ శాంతిః (యజు 36_17) |
| ఁ అనునాసికము | ఉదా:_ ఆదిత్యా అనుమదా స్వ స్తయే (ఋ. 10_5_63) |
| | శయ్యోర్రభి స్రవంతు నః (యజు. 36_12) |
| 'ళ' యొక్క ప్రయోగము | ఉదా:_ అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్ (ఋ 1_1_1) |

(హ్రస్వము, దీర్ఘము, అనునాసికము మరియు ళ వీని నాల్గింటిని యమములందురు).

---

* కుప్వోః ⌣⌢ క ⌣⌢ పౌచ (అష్టాధ్యాయి 8_3_37)

స్వర, వ్యంజన లక్షణము

"స్వయం రాజన్త ఇతి స్వరాః" మహాభాష్యము అ.1 పా.2సు 29 అ1

వేని యుచ్చారణము ఇతర వర్ణముల సహాయము లేకుండగ జరుగునో యవి స్వరము లనబడును. ఉదా :—అ, ఆ, ఇ మొదలగునవి.

"అన్వగ్భవతి వ్యంజనమితి" మహా. అ. 1 పా. 2 సు 29. అ. 1

అచ్చులు కలియనిదే వేని యుచ్చారణ బాగుగ జరుగదో యవి వ్యంజనము లనబడును. ఉదా ;—క్ + అ = క ఇందు 'క్' వ్యంజనము 'అ' స్వరము రెండు కలసి 'క' యైనది. అన్ని వ్యంజనము లీవిధముగనే గ్రహించవలయును.

నోటి యందలి ఆ యా భాగములనుండి ఉచ్చరింపఁబడు వర్ణములు స్థానములనుబట్టి నిమ్న లిఖితముగా చెప్పబడినవి. ఉదా :—కంఠ్యము. తాలవ్యము, మూర్ధన్యము, దంత్యము, ఓష్ఠ్యము, అనునాసికము, కంఠ తాలవ్యము, కంఠోష్ఠ్యము, దంతోష్ఠ్యము, నాసిక్యము. వర్ణములుద్భవించిన స్థాన ప్రయత్నముల నీక్రింది పట్టికల యందు సులభముగా గ్రహించనగును.

## వర్ణోద్భవ స్థాన జ్ఞాపక చక్రము

| కంఠ్యము | తాలవ్యము | మూర్ధన్యము | దంత్యము | ఓష్ఠ్యము | నాసి. | కం. తా. | కం. ఓ. | దం. ఓ. | జి. మూ. | నాసి. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | ఇ | ఋ | ఌ | ఉ | ఞ | ఎ | ఓ | వ | ≍క | |
| క | చ | ట | త | ప | మ | ఐ | ఔ | | | |
| ఖ | ఛ | ఠ | థ | ఫ | ఙ | | | | ≍ఖ | |
| గ | జ | డ | ద | బ | ణ | | | | ం అనుస్వారము | |
| ఘ | ఝ | ఢ | ధ | భ | న | | | | | |
| ఙ | ఞ | ణ | న | మ | | | | | | |
| హ | య | ర | ల | ≍ప | | | | | | |
| ః | శ | ష | స | ≍ఫ | | | | | | |

# ఆభ్యంతర బాహ్య ప్రయత్న జ్ఞాపక చక్రము

| ఆభ్యంతర ప్రయత్నము | సంజ్ఞ | వ్యంజనములు, స్వరములు | బాహ్య ప్రయత్నము | | | |
|---|---|---|---|---|---|---|
| స్పృష్ట | స్పర్శములు | క ప చ ట త | అ.ప్రా. | వివారము | శ్వాసము | అఘోషము |
| | | ఖ ఫ ఛ ఠ థ | మ.ప్రా. | | | |
| | | గజ బమ జఞ డణ దన | అ.ప్రా. | సంవారము | నాదము | ఘోషము |
| | | ఘ భ ఝ ఢ ధ | మ.ప్రా. | సం. | నా. | ఘో. |
| ఈషత్స్పృష్ట | అంతస్థములు | య వ ర ల | అ.ప్రా. | సం. | నా. | ఘో. |
| ఈషద్వివృత | ఊష్మములు | శ ష స | మ.ప్రా. | వి. | శ్వా. | అఘో. |
| | | హ | మ.ప్రా. | సం. | నా. | ఘో. |
| వివృత | స్వర, ఉదాత్త, అనుదాత్త స్వరిత | అ ఇ ఏ ఉ ఓ ఋ ఐ ౡ ఔ | (అల్ప) ప్రాణము | సంవారం | నాదం | ఘోషము |
| సంవృత | ప్రయోగములో హ్రస్వ అ. | | అల్ప ప్రాణము | సంవారము | నాదము | ఘోషము |

# వర్ణోచ్చారణ స్థానముల సూత్రములు

1. అ కు హ విసర్జనీయాః కణ్ఠ్యాః :-అ, ఆ, అ3, 'కు' అనగా క, ఖ, గ, ఘ, ఙ, హ మఱియు ః విసర్జనీయము, ఈ వర్ణములకు కంఠము స్థానము. అనగా జిహ్వాయొక్క మూలము, కంఠముయొక్క అగ్ర భాగము. కాకల్కము (కొండనాలుక) యొక్క క్రిందిభాగము నైనట్టి కంఠ స్థానమునుండి వీని శుద్ధమైన ఉచ్చారణ జరుగును.

2. ఇ చు య శాస్తాలవ్యాః :— ఇ, ఈ, ఇ3 'చు' అనగా చ, ఛ, జ, ఝ, ఞ; య; శ లకు స్థానము తాలువు. దంతముల (పండ్ల) పై భాగమునుండి ఉచ్చరించవలయును. "చ" కారము నుచ్చరించుటకే స్థానమున నాలుకతో ఎటులాచరించవలసి వచ్చునో అటులనే 'శ' కారమును గూడ ఉచ్చరించవలయును.

3. ఋ టు ర షా మూర్ధన్యాః :—ఋ, ౠ, ఋ3, 'టు' అనగా ట, ఠ, డ, ఢ ణ; ర; ష; వీనిని మూర్ధము అనగా తాలువునకు పై భాగమునుండి ఉచ్చరించవలయును. 'ట' కారోచ్చారణ మందొనర్చు క్రియనే 'ష' కారోచ్చారణమందును నొనర్చదగి యున్నది

4, ఉ పూ పధ్మానీయా ఓష్ఠ్యాః :—ఉ, ఊ, ఉ3 'పు' అనగా ప, ఫ, బ భ మ; ⌣ ఉపధ్మానీయమగు ఈ యక్షరము, వీనిని ఓష్ఠ స్థానమునుండి ఉచ్చరించుట శుద్ధము.

5. ఌ తు ల సా దన్త్యాః:—ఌ, ఌ3. 'తు' అనగా త, థ, ద, ధ, న; ల; స ఈ వర్ణములు దంతస్థానములు. దంతములకు జిహ్వను తాకించి వీనిని ఉచ్చరించవలయును.

6. వకారో దన్త్యోష్ఠః :—'వ' కారోచ్చారణము దంతము నుండియు, ఓష్ఠము (పెదవి) నుండియు జరుగును.

7. ఏదై తౌ కణ్ఠ్యతాలవ్యౌ :—ఏ, ఐ లు కంఠముతోను తాలువుతోను పలుక దగినవి.

8. ఓదౌ తౌ కణ్ఠ్యోష్ఠ్యౌ ;— ఓ, ఔలను కంఠము నుండియు, ఓష్ఠము నుండియు పలుకుట సాధువు.

## ఆభ్యంతర ప్రయత్న సూత్రములు

1. స్పృష్ట కరణాః స్పర్శాః:—'క' కారాది మకారాంతము వరకున్న 25 వర్ణములకు స్పృష్ట ప్రయత్నము అనగా వానివాని స్థానము లందు జిహ్వతో స్పర్శించి యీ వర్ణముల నుచ్చరించుట శుద్ధము.

2. ఈషత్ స్పృష్ట కరణాః అన్తస్థాః—అన్తస్థము లనగా య ర ల వ ల ఉచ్చారణము కొద్దిగా స్పర్శించి చేయవలెను.

3. ఈషద్ వివృత కరణా ఊష్మాణః :—ఊష్మములనగా శ ష స హ లు; ఉచ్చారణము ఈషద్ వివృత ప్రయత్నము, కంఠమును కొద్దిగ విప్పి వానివాని స్థానములందు జిహ్వతో కొద్దిగ స్పృశింప వలయును,

4, వివృత కరణాః స్వరాః :— స్వరములకు వివృత ప్రయత్నము. జిహ్వను స్పర్శింపనీయకుండా వీని ఉచ్చారణ మొనర్చ వలయును.

# బాహ్య ప్రయత్న సూత్రములు

1. వర్గాణాం ప్రథమ ద్వితీయాః శషస విసర్జనీయ జిహ్వామూలీయోపధ్మానీయా యమౌ చ ప్రథమ ద్వితీయౌ వివృత కణ్ఠాఃశ్వాసాఽను ప్రదానాశ్చాఽఘోషాః ॥

ఇట వర్గమనగ (కు, చు, టు, తు, పు) అను పంచవర్గములని గ్రహించబడును. వీనిలోని మొదటి రెండక్షరములు అనగా క వర్గములో క, ఖ; చవర్గములో చ, ఛ; టవర్గములో ట, ఠ; తవర్గములో త, థ; పవర్గములో ప, ఫ; ఊష్మములలో శ, ష, స; ః విసర్జనీయము; ≍ జిహ్వామూలీయము; ≍ ఉపధ్మానీయము; ఈ రెండు యమములు మొత్తమీ 18 వర్ణములను (వివృతకంఠ) కంఠమును తెఱచియు, (శ్వాసానుప్రదాన) ఉచ్చారణానంతరము శ్వాసను జోడించియు; (అఘోష) సూక్ష్మధ్వనికై అనురూపక్రియ నొనర్చియు ఉచ్చరింపవలెను.

2. వర్గాణాం తృతీయ చతుర్థా అన్తస్థా హకారానుస్వారౌ యమౌ చ తృతీయ చతుర్థో నాసిక్యాశ్చ సంవృత కణ్ఠా నాదానుప్రదానా ఘోషవన్తశ్చ ॥

ఐదు వర్గములలోని మూడవ, నాలుగవ వర్ణములు గ, ఘ జ ఝ, డ, ఢ, ద, ధ, బ, భ; అంతస్థములు (య ర ల వ) హ; ం అనుస్వారము; మూడవ నాలుగవ యమములు (ం్శ) సానునాసికములగు అకారాది స్వరములు వీనికి సంవృత కంఠము ప్రయత్నము. అనగా కంఠము సంకోచమగును. (నాదాను ప్రదానాః) వీని యుచ్చారణ యందు అవ్యక్తధ్వని ఉండును. (ఘోషవన్తః) వీని యుచ్చారణము గంభీర శబ్దముతో నొనర్చ వలయును.

3. ఏకే అల్పప్రాణా ఇతరే మహాప్రాణాః

ఐదు వర్గములలోని ప్రథమ తృతీయ పఞ్చ మాక్షరములు (క గ ఙ చ జ ఞ ట డ ణ త ద న ప బ మ య ర ల వ) యమములలో ప్రథమ తృతీయ (ఁ ం) ములు ఇవన్నియు అల్ప ప్రాణములు కొద్ది బలముతో ఉచ్చరించబడును. మిగిలినవి (ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ శ ష స హ) ః ; ం ; ఁ ; ళ అకారాది స్వరములు ఇవి యన్నియు మహా ప్రాణములు అనగా అధిక బలముతో నుచ్చరింపబడును

4. యథా తృతీయా స్తథా పఞ్చమా

వర్గములోని తృతీయ వర్ణములవలెనే పఞ్చమాక్షరము (ఙ ఞ ణ న మ)లకు సంవృత కంఠము; నాదాను ప్రదానము; ఘోషము ప్రయత్న ములని తెలిసికొనవలయును.

---

## 2. ప్రత్యాహార సూత్రముల ప్రకరణము

(1) అఇఉణ్ (2) ఋఌక్ (3) ఏఓఙ్ (4) ఐఔచ్ (5) హయవరట్ (6) లణ్ (7) ఞమఙణనమ్ (8) ఝభఞ్ (9) ఘఢధష్ (10) జబగడదశ్ (11) ఖఫఛఠథ చటతవ్ (12) కపయ్ (13) శషసర్ (14) హల్.

ఇవి చతుర్దశ ప్రత్యాహార సూత్రములు. ఈ సూత్రములను ఆధా రముగా గొని మహర్షి పాణిని సమస్త వ్యాకరణమునకు సంబంధించిన విషయములను సరళ రూపములో అతి సంక్షిప్తముగా వచించిరి. ఈ సూత్రములను అణ్, అచ్ మొదలగు ప్రత్యాహారముల సిద్ధికై పై క్రమ మున ఏర్పరచిరి. ప్రత్యాహారమనగా (ఆదిరంత్యేన సహేతా) పైవానిలో

మొదటి అక్షరము చివరనున్న హొల్లక్షరములతో కలిపి యుచ్చరింపఁగా నేర్పడు అచ్, హల్ మొదఁగునవి. అట్టివి మధ్యనున్న యక్షరములను బోధించును. ఈ సూత్రముల అంతిమ వర్ణము కేవలము సంకేతముల స్వరూపమును తెలియచేయును. వీనిని ఇత్తులందురు. అవి ప్రత్యాహారము లోని వర్ణమాలయందు లెక్కింపబడవు.

ప్రత్యాహారములను తెలిసికొనుటకు సుగమ పద్ధతి య ర ల వ శ ష స హ వీనిని రెండు భాగములుగా చేసి య ర ల వ హ లు మొదట చేర్చబడినవి. తర్వాత వర్గములోని పంచమ, చతుర్థ, తృతీయ, ద్వితీయ ప్రథమ వర్ణములు క్రమముగా చేర్చఁబడినవి. య ర ల వ శ ష స హ లను ద్వితీయ భాగము గావించి శ ష స హ అంతమున నుంచిరి. ఈ క్రమమును అభ్యసించిన ప్రత్యాహారములను సులభముగా గుర్తుపెట్టుకొనవచ్చును. 'ఝల్' ప్రత్యాహారమనుటతోడనే 'ఝ' చతుర్థ వర్ణమని మరియు 'ల్' అంతమునందున్నది, కావున 'ఝల్' ప్రత్యాహార మందు వర్గములోని చతుర్థ, తృతీయ, ద్వితీయ, ప్రథమ వర్ణములు మరియు శ ష స హ వర్ణములును గలవని యర్థము. ఈ లాగుననే ప్రత్యాహారముల వర్గీకరణానుసారము తెలిసికొనవలయును. 'అచ్'అనగా అన్ని స్వరములు. 'ఞమ్' = పంచమ వర్ణములు. 'ఝష్' అనగా చతుర్థ వర్ణములు. 'జశ్' అనగా తృతీయ వర్ణములు. 'ఖర్' అనగా ద్వితీయ, ప్రథమ వర్ణములు. మరియు శ ష స లును. 'ఝర్'అనగా చతుర్థ,తృతీయ ద్వితీయ, ప్రథమ వర్ణములును శ ష స లును. 'అశ్'అనగా స్వరములు, య ర ల వ హ పంచమ,చతుర్థ మరియు తృతీయ వర్ణములు. 'ఇచ్'అనగా 'అ'ను వదలి అన్ని స్వరములనియు 'చయ్' అనగా వర్గములోని ప్రథమ వర్ణములు. 'అమ్' అనగా స్వరములు, య ర ల వ హ మరియు పంచమ వర్ణములు. 'చర్' అనగా ప్రథమ వర్ణములు మరియు శ ష స 'యయ్' అనగా శ ష స హ లను వదలి అన్ని వ్యంజనములనియు నెరుగవల

యును. ఈ విధముగా అభ్యసించిన ఎట్టి క్లేశమునకు గురికావలసి యుండదు ప్రత్యాహారములనేకములు చేయవచ్చును. కాని పాణిని 41 ప్రత్యాహారములను అష్టాధ్యాయి యందు వాడిరి. అవి:—

1. అక్ = అ, ఇ, ఉ, ఋ, ఌ. అనగా అఇఉణ్, ఋఌక్ లో 'అ'ను మరియు 'క్'ను కలిపి యుచ్చరించగా 'అక్' ఏర్పడినది. మధ్య నున్న అన్ని యక్షరములను గ్రహించ వలయును. అంతిమ హల్లు ఇత్తగుటచే గ్రహించబడదు.

2. అచ్ = అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ, ఐ ఔ

3. అణ్ = అ, ఇ, ఉ (పర ణకారముతో ప్రత్యాహారమైన యెడల ఋ ఌ ఏ ఓ ఐ ఔ హ య వ ర ల'లు కూడ అణ్ లోనికి చేరును.)

4. అట్ = అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ, ఐ, ఔ, హ, య, వ ర.

5. అమ్ = అ, ఇ, ఉ, ఋ ఌ, ఏ, ఓ, ఐ, ఔ, హ, య, వ, ర, ల, ఞ, మ, ఙ, ణ, న.

6. అల్ = అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ, ఐ, ఔ, హ, య, వ, ర, ల, ఞ, మ, ఙ, ణ, న, ఝ, భ, ఘ, ఢ, ధ, జ, బ, గ, డ, ద, ఖ, ఫ, ఛ, ఠ, థ, చ, ట, త, క, ప, శ, ష, స, హ.

7. అశ్ = అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ, ఐ, ఔ, హ, య, వ, ర, ల, ఞ, మ, ఙ, ణ, న, ఝ, భ, ఘ, ఢ, ధ, జ, బ, గ, డ, ద.

8. ఇక్ = ఇ, ఉ, ఋ, ఌ.

9 ఇచ్ = ఇ, ఉ, ఋ, ఌ ఏ, ఓ, ఐ, ఔ.

10. ఇణ్ = ఇ ఉ ఋ ఌ ఏ ఓ ఐ ఔ హ య వ ర ల.

11. ఉక్ = ఉ ఋ ఌ.

12. ఏఙ్ = ఏ ఓ.

13. ఏచ్ = ఏ ఓ ఐ, ఔ.

14. ఐచ్ = ఐ ఔ.

15. ఖయ్ = ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప.

16. ఖర్ = ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స.

17. ఙమ్ = ఙ ణ న

18. చయ్ = చ ట త క ప.

19. చర్ = చ ట త క ప శ ష స.

20. ఛవ్ = ఛ ఠ థ చ ట త.

21. జశ్ = జ బ గ డ ద.

22. ఝయ్ = ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప.

23. ఝర్ = ఝ, భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స.

24. ఝల్ = ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స హ.

25. ఝశ్ = ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద.

26. ఝష్ = ఝ భ ఘ ఢ ధ.

27. బశ్ = బ గ డ ద,

28. ఝష్ = ఝ ఘ ఢ ధ.

29. మయ్ = మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప.

30. ఞష్ = ఞ వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ.

31. యణ్ = య వ ర ల.

32. యమ్ = య వ ర ల ఞ మ ఙ ణ న.

33. యయ్ = య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ, చ, ట, త, క ప.

34. యఞ్ = య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ.

35. యర్ = య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స హ.

36. రల్ = ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స హ.

37. వల్ = వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స హ.

38. వశ్ = వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద.

39. శర్ = శ ష స.

40. శల్ = శ ష స హ.

41. హల్ = హ య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద ఖ ఫ ఛ ఠ థ చ ట త క ప శ ష స హ.

42. హశ్ = హ య వ ర ల ఞ మ ఙ ణ న ఝ భ ఘ ఢ ధ జ బ గ డ ద.

---

# 3. సంస్కృత శబ్దముల ప్రకరణము

| ప్రథమ పురుష సర్వనామము | మధ్యమ పురుష సర్వనామము | ఉత్తమ పురుష సర్వనామము |
|---|---|---|
| సః = అతడు (వాడు) | త్వమ్ = నీవు | అహమ్ = నేను |
| తౌ = వారిద్దరు | యువామ్ = మీరిద్దరు | ఆవామ్ = మేమిద్దరము |
| తే = వారందరు | యూయమ్ = మీరందరు | వయమ్ = మేమందరము |

వర్తమాన కాలమున (అనగా లట్ లకారమున) ప్రథమ పురుష క్రియ యందు నిమ్న లిఖిత ప్రత్యయములు వచ్చును. భ్వాది గణము యొక్క ధాతువు తర్వాత ప్రత్యయములకు ముందు 'అ' చేర్చబడును. దీనిని వికరణ మందురు.

ప్రథమ పురుష

| ధాతు | వికరణము | ప్రత్యయము | రూపము | అర్థము |
|---|---|---|---|---|
| వస్ + | అ + | తి = | వసతి (వాడు) | నివసించుచున్నాడు |
| వస్ + | అ + | తః = | వసతః (వారిద్దరు) | నివసించుచున్నారు |
| వస్ + | అ + | అంతి = | వసంతి (వారందరు) | నివసించుచున్నారు |

ప్రథమ పురుషముయొక్క బహువచనమునందు రెండు 'అ' లకు పరరూపము జరుగును. సంస్కృతమునందు కర్త ఏ లింగములో నున్నను, క్రియలో ఎట్టి మార్పు ఏర్పడదు. సంస్కృతమునందు ఏకవచనము, బహువచనమేగాక ద్వివచనము కూడ ఉన్నది. క్రియయు క్రియావాచ్య మగునదియు నొక వచనములో నుండవలయును. ఉదా:- స వసతి, తౌ వసతః, తే వసంతి.

మధ్యమ పురుషము

వస్ + అ + సి = వససి (నీవు) నివసించుచున్నావు

వస్ + అ + థః = వసథః (మీరిద్దరు) నివసించుచున్నారు.

వస్ + అ + థ = వసథ (మీరందరు) నివసించుచున్నారు.

ఉత్తమ పురుషము

వస్ + అ + మి = వసామి (నేను) నివసించుచున్నాను.

వస్ + అ + వః = వసావః (మేమిద్దరము) నివసించుచున్నాము.

వస్ + అ + మః = వసామః (మేమందరము) నివసించుచున్నాము.

ఉత్తమ పురుషమందు వికరణి ప్రత్యయముయొక్క అకారమునకు దీర్ఘ మేర్పడును.

స వసతి = అతడు నివసించుచున్నాడు

తౌ వసతః = వారిద్దరు నివసించుచున్నారు.

తే వసంతి = వారందరు నివసించుచున్నారు.

త్వం వససి = నీవు నివసించుచున్నావు.

యువాం వసథః = మీరిద్దరు నివసించుచున్నారు.

యూయం వసథ = మీరందరు నివసించుచున్నారు.

అహం వసామి = నేను నివసించుచున్నాను.

ఆవాం వసావః = మేమిద్దరము నివసించుచున్నాము.

వయం వసామః = మేమందరము నివసించుచున్నాము.

---

# 4. సంధి ప్రకరణము

రెండక్షరముల కలయికచే నేర్పడిన మార్పునకు సంధియందురు. "పరః సన్నికర్షః సంహితా" (అ. 1-4-108). సంధి నాలుగు విధములు. 1. స్వర సంధి 2. హల్ సంధి 3. హల్ - స్వర సంధి 4. విసర్గ సంధి.

1. రెండు స్వరములు కలసిన స్వరసంధి యగును. ఉదా: భావ + అర్థః = భావార్థః

2. ఏవేని రెండు వర్ణములయందు సంధియైన వానిలో ఒక అక్షరము వ్యంజనమైయుండి రెండవ యక్షరము స్వరము లేక వ్యంజనమైనచో 'హల్' సంధి యనబడును. ఉదా :—వాక్ + ఇతి = వాగితి; తత్ + అర్థమ్ = తదర్థమ్.

3. విసర్గముతో స్వరము లేక వ్యంజనము యొక్క సంధియైనచో విసర్గ సంధి యందురు. ఉదా :-మునిః + అపి మునిరపి, నిః + ధనస్య = నిర్ధనస్య.

1. స్వర సంధి :

సవర్ణ దీర్ఘ సంధి.

సవర్ణ (ఒకే జాతికి చెందిన) స్వరములు (హ్రస్వము లేక దీర్ఘము) వెంట వెంట వచ్చిన రెండింటికి బదులుగా సవర్ణ దీర్ఘ స్వరము ఏర్పడును. దీనికి అష్టాధ్యాయిలోని "అకః సవర్ణే దీర్ఘః" (అ. 6-1-97) అను సూత్ర నియమములు వర్తించును.

ఉదా :— కల్ప + అంత = కల్పాంత; ధర్మ + అర్థ = ధర్మార్థ కదా + అపి = కదాపి; విద్యా + అభ్యాస = విద్యాభ్యాస.

ఇకారము.

కవి + ఇంద్రః = కవీంద్రః;

జానకీ + ఈశః = జానకీశః

ఉకారము.

భాను + ఉదయః = భానూదయః

లఘు + ఊర్మిః = లఘూర్మిః, వధూ + ఉత్సవః = వధూత్సవః

గుణసంధి ;

అకారమునకు పరముగా ఇ లేక ఈ ఉండిన రెండు కలసి 'ఏ'; ఉ లేక ఊ ఉండిన రెండు కలసి 'ఓ' మరియు ఋ ఉండిన 'అర్' అగును. ఈ మార్పును గుణమని యందురు. "అద్ గుణః" (అ6_1_84) లోని సూత్ర నియమములు వర్తించును.

దేవ + ఇంద్రః = దేవేంద్రః

సుర + ఈశః = సురేశః

మహా + ఇంద్రః = మహేంద్రః

రమా + ఈశః = రమేశః

చంద్ర + ఉదయః = చంద్రోదయః

సముద్ర + ఊర్మిః = సముద్రోర్మిః

మహా + ఉత్సవః = మహోత్సవః

సప్త + ఋషిః = సప్తర్షిః

మహా + ఋషిః = మహర్షిః

వృద్ధిసంధి :

అకారమునకు పరముగా ఏ లేక 'ఐ' ఉండిన రెండు కలసి ఐ అగును. ఓ లేక ఔ ఉండిన 'ఔ' అగును. ఈ మార్పునకు వృద్ధి యందురు. "వృద్ధిరేచి" (అ 6_1_85). సూత్రము వర్తించును.

ఏక + ఏవ = ఏకైవ

సదా + ఏవ = సదైవ

మత + ఐక్య = మతైక్య

రోగ + ఔషధమ్ = రోగౌషధమ్

మహా + ఓజః = మహౌజః

యనాదేశసంధి :-

హ్రస్వ దీర్ఘములగు ఇకారములకు పరముగా ఏ దేని విజాతీయ స్వరము వచ్చిన యెడల ఇ, ఈలకు బదులుగా 'య్' అగును. ఉ, ఊలకు పరముగా ఏ దేని విజాతీయ స్వరము వచ్చిన ఉ, ఊల స్థానమున 'వ్' మరియు ఋ యొక్క స్థానమున 'ర్' వచ్చును. "ఇకోయణచి" (అ. 6-1-74). సూత్రము వర్తించును.

యది + అపి = యద్యపి

ఇతి + ఆది = ఇత్యాది

ప్రతి + ఉపకారః = పత్యుపకారః

ప్రతి + ఏకః = ప్రత్యేకః

సఖీ + ఉచిత = సఖ్యుచిత

దేవీ + ఐశ్వర్యమ్ = దేవ్యైశ్వర్యమ్

మను + అంతర = మన్వంతర

సు + ఆగతమ్ = స్వాగతమ్

అను + ఏషణ = అన్వేషణ

పితృ + అనుమతి — పిత్రనుమతి

మాతృ + ఆనంద = మాత్రానంద

అయవాదేశ సంధి

ఏ కు పరముగా ఏ దేని స్వరము వచ్చిన రెండింటి స్థానమున "అయ్", ఐ కు పరముగా ఏ దేని స్వరము వచ్చిన రెండింటి స్థానమున "ఆయ్" మరియు ఓ కు పరగా ఏ దేని స్వరము వచ్చిన రెండింటి స్థానములో "అవ్" మరియు ఔనకు పరముగా స్వరము వచ్చిన "ఆవ్" ఏర్పడును. "ఏచోఽయవాయావః" (అ: 6-1-75) సూత్రము వర్తించును.

హరే+ఏ = హరయే

నే+అన = నయన

నై +అకః = నాయకః

గై +అకః = గాయకః

భో+అనమ్ = భవనమ్

గో+ఈశః = గవీశః

పౌ+అకః = పావకః

పూర్వరూప సంధి :

పదాన్తమందలి ఏ ఓ లకు పరముగా అ వచ్చిన దాని లోపము జరుగును. మరియు దాని స్థానమున లుప్త అకార చిహ్నము (ఽ) వచ్చును. ఈ మార్పునకు పూర్వ రూపము అని కూడ అందురు. "ఏఙః పదాంతాదతి" (అ. 6-1-105) సూత్రము వర్తించును.

తే+అపి = తేఽపి

తే+అత్ర = తేఽత్ర

యో+అసి = యోఽసి

సాధో+అత్ర = సాధోఽత్ర

ఈ క్రిందివానికి సంధిచ్ఛేదము కావింపుము.

అభ్యాసము :—తచ్ఛాత్రమ్, నిర్ధనాయ, మునీంద్ర, ధనేంద్ర. సూర్యోదయః, హిమర్తుః, తవైశ్వర్యమ్. తవౌదార్యమ్, విధూదయః, పదార్థ, తన్మిత్రమ్ దైత్యారి, దయానందః, కవీచ్ఛా, దేవర్షిః. దూరాదాగతః, విధురపి, శశబ్కాః, ప్రత్యేకమ్, రమేశః, మహోపదేశః. నద్యంబు, మహౌషధీ.

3. హల్ స్వర సంధి:—

వర్గములోని మొదటి అక్షరములు అనగా క్ చ్ ట్ త్ ప్ లకు పరముగా అనునాసికములను వదలి ఘోష వర్ణములుండిన వాని స్థానములో క్రమముగా వర్గములోని తృతీయ అక్షరములు అనగా గ్ జ్ డ్ ద్ బ్‌లు వచ్చును. "ఝలాం జశో౽న్తే" (అ. 8-2-39)

వాక్ + అత్ర = వాగత్ర

అచ్ + అన్తః = అజన్తః

షట్ + అన్తః = షడన్తః

విట్ + ఇహః = విడిహః

సమ్రాట్ + అత్ర = సమ్రాడత్ర

సమిధ్ + అత్ర = సమిధత్ర

అప + అయనమ్ = అబయనమ్

సుప్ + అన్తః = సుబంతః

తిప్ + అన్తః = తిబన్తః

4. హల్ సంధి

వర్గములోని ప్రథమాక్షరములు (క్ చ్ ట్ త్ ప్ లకు పరముగా అనునాసికలు ( ఙ్ ఞ్ ణ్ న్ మ్ ) వర్ణములుండిన ప్రథమాక్షర

ముల స్థానములో వానిలో ఆదేశ వర్ణముయొక్క పఞ్చమాక్షరము (అను నాసిక వర్ణము) వచ్చును. "యరోఽనునాసికేఽను నాసికోవా" (అ. 8-4-44).

వాక్ + నమతి = వాఙ్నమతి

వాక్ + మయమ్ = వాఙ్మయమ్

షట్ + మాసః = షణ్మాసః

జగత్ + నాథః = జగన్నాథః

తకు పరముగా 'చ్, ట్, ల్' ఉండిన 'త'కు బదులుగా 'చ్ ట్ ల్. లు ఏర్పడును. మరియు 'ఛ్' ఉండి పూర్వ వర్గమునకు 'చ్' అగును'. "స్తోః శ్చునాశ్చుః", "తోర్లి" (అ. 8-4-39, 59)

తత్ + చక్రమ్ = తచ్చక్రమ్

భవత్ + టీకా = భవట్టీకా

తత్ + లీనమ్ = తల్లీనమ్

తత్ + ఛవి = తచ్ఛవి

త కు పరముగా స్వరము లేక గ్ ఘ్ ద్ ధ్ బ్ భ్ య్ ర్ వ్ లుండిన త్ స్థానములో ద యగును,

సత్ + ఆనందః = సదానందః

జగత్ + ఈశః = జగదీశః

జగత్ + రామః = జగద్రామః

తత్ + రూపమ్ = తద్రూపమ్

త్ లేక ద్ కు పరముగా శ్ యుండిన త్ ద్ కు బదులుగా చ్' మరియు 'శ్' కు బదులుగా 'ఛ్' అగును. మరియు త్ ద్ లకు

పరముగా 'హ' యుండిన త్ ద్‌ల స్థానములో 'ద్' మరియు హ స్థానములో 'ధ్' ఏర్పడును.

సత్ + శాస్త్రమ్ = సచ్ఛాస్త్రమ్
ఉత్ + హార = ఉద్ధార.

'మ్' కు పరముగా స్పర్శ వర్ణములుండిన 'మ్'కు బదులుగా వికల్పముగా (అనగా ఒక స్థానమున ఏర్పడుట మరొక స్థానమునకాకుండ) చేత అనుస్వారము (ం) మరియు అదే వర్ణముయొక్క అనునాసిక వర్ణమేర్పడును.

సమ్ + కల్ప = సంకల్ప లేక సఙ్కల్ప. సమ్ + తోష = సంతోష
కిమ్ + చిత్ + కించిత్, కిఞ్చిత్ సమ్ + పూర్ణః = సంపూర్ణః

'మ్' కు పరముగా అంతస్థము లేక ఊష్మవర్ణములుండిన 'మ్' అనుస్వారముగా మారును.

కిమ్ + వా = కింవా, సమ్ + హారః = సంహారః,
సమ్ + యోగః. = సంయోగః. సమ్ + వాదః = సంవాదః

'ఋ. ర్' లేక 'ష్'కు పరముగా 'న్' కారముండిన మరియు వాని మధ్య స్వరము క వర్గ, ప వర్గ, అనుస్వారము, మ్, ర్, హ్ లు వచ్చిన 'న్' కు 'ణ్' భర్ + అన = భరణ, భూ + షన = భూషణ. ప్ర + మాన = ప్రమాణ యగును.

ఏదేని శబ్దముయొక్క ఆద్య 'స్' యొక్క పూర్వ అ ఆ లకు బదులుగా మరియొక ఏవేని స్వరములు వచ్చిన 'స్' కు 'ష్' యగును.

వి + షమ = విషమః
సు + సుప్తిః = సుషుప్తిః

5 విసర్గ సంధి :—

విసర్గమునకు పరముగా చ లేక ఛ వుండిన విసర్గముచోట 'శ్' వచ్చును. "స్తోః శ్చునాశ్చుః" (అ 8—4—39) సూత్రము వర్తించును.

నిః + చల = నిశ్చల

విసర్గములకు పరముగా ట లేక ఠ వచ్చిన విసర్గమునకు 'ష' ఏర్పడును."ష్టునాష్టుః" (8-4-40).

ధనుః + టంకార = ధనుష్టంకారః

విసర్గమునకు పరముగా త, థ లుండిన విసర్గము 'స' యగును. యధా :—

మనః + తాప = మనస్తాప

సంధిచ్ఛేదము గావించుము :—

అభ్యాసము :—తల్లోకేన, వాఙ్మయమ్, ఉద్ధతః, పునశ్చ, భవదాగమనమ్, తన్నీరమ్, వాగ్మిః, జగన్నాథః, షణ్ముఖః, బృహల్లాభః, గంతవ్యమ్, ధర్మాదభ్రష్టః, తదు పాఖ్యానమ్, పునరపి, సమ్యగుక్తమ్, ఃఘుచ్ఛత్రమ్, భ్రాతరాగచ్ఛ, భవదృణమ్, భవన్మతమ్, ధిగ్లుబ్ధమ్, రామశ్చినోతి, శత్రుఞ్జయః

విసర్గమునకు పరముగా శ్ ష్ లేక స్ ఉండిన విసర్గమునకు కూడ శ్ ష్ స్ వికల్పముగా యగును. విసర్గము శ ష స లు రానిచో విసర్గమే యుండును. "వాశరి"(అ 8-3-36) సూత్రము వర్తించును.

కః + శేతే = కశ్శేతే, కః శేతే

పుత్రః + సేవతే = పుత్రస్సేవతే, పుత్రః సేవతే

దుః + శాసన = దుశ్శాసన, దుఃశాసన

నిః + సందేహ = నిస్సందేహః, నిఃసందేహః

విసర్గమునకు పరముగా క ఖ లేక ప ఫ వచ్చిన విసర్గమునకు ఎట్టి సంధి జరగదు.

పయః + పానమ్ = పయఃపానమ్.

విసర్గమునకు పరముగా ఇ గాని ఉ గాని యుండి క ఖ లేక ప ఫ పరముగా నుండిన విసర్గ స్థానములో 'ష్' యగును. ఇదుదుపధస్య చాప్రత్యయస్య (అ 8-3-41) సూత్రము వర్తించును.

నిః + కపటః = నిష్కపటః

దుః + కర్మ = దుష్కర్మ

నిః + ఫలమ్ = నిష్ఫలమ్

దుః + ప్రకృతి = దుష్ప్రకృతి

విసర్గమునకు ముందుగా 'అ' యుండి పరమున ఘోష వ్యంజనము లుండిన అకారము మరియు విసర్గ (అః) కు బదులుగా ఓ యగును. హశిచ (6-1-110) అను సూత్రము వర్తించును.

అధః + గతి = అధోగతి, కః + గత = కోగత, మనః + యోగ = మనోయోగ, తేజః + రాశి = తేజోరాశి, వయః + వృద్ధ = వయోవృద్ధ బాలః + దదాతి = బాలో దదాతి.

విసర్గమునకు ముందుగా అకారము (అ ఆ) ల కాక అన్యములైన ఈ స్వర ముండిన మరియు పరముగా ఘోష వర్ణములుండిన విసర్గస్థానములో 'ర్' యగును. యధా :—

నిః + ఆశా = నిరాశా, దుః + ఉపయోగః = దురుపయోగః, నిః + గుణః = నిర్గుణః, బహిః + ముఖః = బహిర్ముఖః

విసర్గమునకు ముందుగా ర యుండిన విసర్గమునకు లోపము సంభవించి స్వరమునకు దీర్ఘ మగును.

నిః + రోగ = నీరోగ, మునిః + రాజా = మునీరాజా, నిః + రసః = నీరసః, పునః + రచనా = పునారచనా.

అంతము యొక్క 'ర్' స్థానమునకు విసర్గ మేర్పడును. 'ర్' కు పరముగా అఘోష వర్ణములు వచ్చిన విసర్గము పూర్వము వలననే యుండును. ఘోష వర్ణములుండిన 'ర్' యథాపూర్వకముగా నుండును, యథా;—

ప్రాతర్ + కాల్ = ప్రాతఃకాల
అంతర్ + కరణ = అంతఃకరణ
అంతర్ + పుర = అంతఃపుర
పునర్ + ఉక్తి = పునరుక్తి
పునర్ + జన్మ = పునర్జన్మ

సంధిచ్ఛేదము గావించుము :—

అభ్యాసము :—అశ్వారోహణమ్, కపీంద్రః, లఘోత్సవః, సత్యేంద్రః, సూర్యోదయః, తథైవ, వనౌషధమ్, సత్యపి,మధ్వరిః, మాత్రే, హరయే, విష్ణవే, తావాగతౌ, సోఽపి, కోఽపి, శత్రవోఽపి, యశ్చకార, తన్మాత్రమ్, ఏతదర్థమ్, చిదానందః, తచ్ఛత్రమ్, మద్రూపమ్,సజ్ఝ, కశ్చిత్, నిష్ఫలమ్, మనోవినోదాయ, ఎతన్నైవ

సంధి చేయుము :—

అత్ర + ఆగత్య, జ్ఞాన + అమృతేన, ఏష + ఏవ, భూమిః + అలంక్రియతే, జిత + ఇంద్రియః, రుధిర్ + ఓఘమ్, తత్ + అనుచరాణి, వాయో + అస్త్రేణ, తపః + వనమ్, త్వమపి + అస్మాభిః షట్ + దినాని

సః + ఏషః, గీతః + అసి, భారద్వాజః + తాన్. సత్ + చకార, తత్ + ఉత్తరమ్. కీదృశః + రామః, ఇతి + అపృచ్ఛత్, ఉదరాత్ + జాతమ్, రామలక్ష్మణయోః + వనగమనమ్, శత్రుఘ్నః + చ, భ్రాతుః + ద్్నాయ, కత్ + చిత్, చంద్రాత్ + అపేయాత్.

## 5. తిజంత ప్రకరణము

తిజ్ ప్రత్యయములను క్రియాపదమును చేయుటకు ప్రయోగింతురు. వీని ప్రయోగము మున్ముందు బోధపడును. 'తిజ్' అనునది ప్రత్యాహారము

సంస్కృత భాషయందు ముఖ్యముగా నాలుగు రకముల శబ్దము లుండును. (1) నామము (2) క్రియా (ఆఖ్యాతము) 3. ఉపసర్గలు (4) నిపాతములు. సంస్కృత భాషయందుగల క్రియలన్నియు 2018 ధాతువుల (మూల) రూపముల చేతనే ఏర్పడును. అన్ని ధాతువులను పది విభాగములు (గణములు) కావించిరి. 1. భ్వాది 2. అదాది 3. జుహోత్యాది 4. దివాది 5. స్వాది 6. తుదాది 7. తనాది 8. క్ర్యాది 9. రుధాది 10 చురాది.

ధాతువులు రెండు విధములు "పరస్మై పదీ" : "ఆత్మనే పదీ" మరియు కొన్ని "ఉభయపదిగా" కూడ ప్రయోగింప దగినవిగా నుండును

ధాతువులతో కలియు తిజంత ప్రత్యయములు.

పరస్మైపదము (పరుల కొరకు)

| | ఏక. వ | ద్వి. వ | బహు. వ. |
|---|---|---|---|
| ప్ర. పు. | తిప్ (తి) | తస్ (తః) | ఝి (అంతి) |
| మ. పు. | సిప్ (సి) | థస్ (థః) | థ (థ) |
| ఉ. పు. | మిప్ (మి) | వస్ (వః) | మస్ (మః) |

### ఆత్మనే పదము (తన కొఱకు)

| | ఏక. వ. | ద్వి. వ | బహు. వ |
|---|---|---|---|
| ప్ర. పు | త (త) | ఆతామ్ | ఝ (అంత) |
| మ. పు. | థాస్ (థాస్) | ఆథామ్ | ధ్వమ్ |
| ఉ. పు. | ఇట్ (ఇ) | వహి | మహిఙ్ (మహి) |

### భ్వాదిగణము వర్తమానకాలము (లట్)

నియమము_1 భ్వాదిగణ ధాతువులకు పరమగా శప్ (అ) చేర్చి తిఙంత ప్రత్యయములను చేర్చవలయును. 'శప్' లో శకారము పకారములు ఇత్తులు అవి లోపించి కేవలము 'అ' మిగులును. ఉదా :-

పఠ్ + అ + తి = పఠతి
పఠ్ + అ + తః = పఠతః
పఠ్ + అ + అంతి = పఠంతి
పఠ్ + అ + సి = పఠసి
పఠ్ + అ + థః = పఠథః
పఠ్ + అ + థ = పఠథ
పఠ్ + అ + మి = పఠామి
పఠ్ + అ + వః = పఠావః
పఠ్ + అ + మః = పఠామః

అకారమునకు అంతి పరమగునపుడు పరరూపము వచ్చును. మకార వకారములు పరములగునపుడు అకారమునకు దీర్ఘము వచ్చును.

ఈ పై విధముగనే ఈ నిమ్న పరస్మైపదీ ధాతువులకు రూపములు వ్రాయుడు.

అభ్యాసము :—

| ధాతువు | అర్థము | ధాతువు | అర్థము |
|---|---|---|---|
| పఠ్ | = పఠించుట | ఖాద్ | = తినుట |
| చర్ | = చరించుట | పచ్ | = వండుట |
| తప్ | = తపించుట | నమ్ | = నమస్కరించుట |
| నట్ | = నటించుట | రక్ష్ | = రక్షించుట |
| వహ్ | = ధరించుట | ధావ్ | = పరుగిడుట |
| అట్ | = తిరుగుట | దహ్ | = దహించుట |
| అర్చ | = పూజించుట | త్యజ్ | = త్యజించుట |
| పత్ | = పడుట | చల్ | = చలించుట |
| వద్ | = చెప్పుట | హస్ | = నవ్వుట |

మాతృభాషలోనికి అనువదించుడు

స పఠతి. స చలతి, స వదతి. సత్యజతి. స హసతి. స ధావతి.

త్వం యజసి. త్వం నమసి. త్వం వససి. త్వం రక్షసి, త్వం తపసి.

అహం పఠామి. అహం నమామి. అహం వదామి. అహం చరామి అహం ఖాదామి

2. సంస్కృతములోనికి అనువదించుడు.

అతడు చెప్పుచున్నాడు, అతడు కాల్చుచున్నాడు. అతడు చదువుచున్నాడు. నీవు పరుగెత్తుచున్నావు. నీవు నవ్వుచున్నావు. నీవు రక్షించుచున్నావు. నేను తినుచున్నాను. నేను పండించుచున్నాను. నేను నడచుచున్నాను.

నియమము-2. అంతమున నుండు ఇ ఉ ఋ వర్ణములకు గుణమగును. అనగా 'ఇ వర్ణమునకు ఏ'; 'ఉ' వర్ణమునకు 'ఓ' 'ఋ' వర్ణమునకు 'అర్' క్రమముగా గుణములగును. మరియు ఏ, ఓ, ఐ, ఔ యొక్క స్థానమునందు క్రమముగా "అయ్, అవ్, ఆయ్, ఆవ్" లు అగును. స్వరము పరముగా నుండగా ఉదా :-

1. సృ + అ + తి = సర్ + అ + తి = సరతి (కదలుట)

2. నీ + అ + తి = నే + అ + తి—'నీ' గుణమై 'నే' యై 'ఏ'కు 'అయ్' రాగా నయ్ + అ + తి = నయతి (తీసికెళ్లుట) సిద్ధించినది.

3. భూ + అ + తి = భో అతి = భవ్ + అ + తి = భవతి

4. క్షి + అ + తి = క్షే + అతి = క్షయ్ + అ + తి = క్షయతి

పై నియమముల ననుసరించి నిమ్న ధాతువుల రూపము చేయుడు.

అభ్యాసము :

| ధాతువు | రూపము | అర్థము | ధాతువు | రూపము | అర్థము |
|---|---|---|---|---|---|
| హృ | (హర్) | హరించుట | స్మృ | (స్మర్) | స్మరించుట |
| జి | (జయ్) | జయించుట | తృ | (తర్) | తరించుట |
| శ్వి | (శ్వయ్) | పెరుగుట | శ్రి | (శ్రయ్) | ఆశ్రయముపొందుట |
| వే | (వయ్) | అల్లుట | ధ్యై | (ధ్యాయ్) | ధ్యానించుట |
| గై | (గాయ్) | పాడుట | ధే | (ధయ్) | త్రాగుట |
| ఖన్ | | త్రవ్వుట | | క్రంద్ = | ఏడ్చుట |

మూర్ఛ = మూర్ఛపోవుట    తక్ష్ = చెక్కుట

అనువాదము :

తౌనయతః. ఆవాం క్షయావః. యువాం మంథథః. యువాం వదథః యువాం హరథః. యువాం భవథః. ఆవాం జయావః. తౌ భ్రమతః. తౌ అందతః. తౌ ఖాదతః. స ధయతి.

మేమిద్దరము తీసికొనివెళ్లుచున్నాము. మేమిద్దరము కట్టుచున్నాము. మీరిద్దరు ధ్యానించుచున్నారు. మీరిద్దరు త్రవ్వుచున్నారు. మీరిద్దరు స్మరించుచున్నారు. వారిద్దరు వవ్వుచున్నారు. వారిద్దరు తీసికొనివెళ్లుచున్నారు. వారిద్దరు చదువుచున్నారు.

నియమము—3 : ఉపధ "అలోన్త్యాత్ పూర్వ ఉపధా" (అ1-1-64) అనగా అంత్య వర్ణమునకు పూర్వముండు వర్ణమును ఉపధ యందురు. ధాతువులో ఉపధగా హ్రస్వములగు ఇ 'ఋ' వర్ణములుండిన వానికి గుణము వచ్చును.

1. బుధ్ + అ + తి = బోధతి (తెలిసికొనుట) బు లో నున్న 'ఉ' కు 'ఓ' ఏర్పడి 'బో' యైనది.

2. క్ష్విడ్ + అ + తి = క్ష్వేడతి క్ష్వినకు క్ష్వే ఏర్పడినది.

3. ఘృష్ + అ + తి = ఘర్షతి ఘృనకు 'ఘర్' ఏర్పడినది.

అభ్యాసము :

| | |
|---|---|
| జీవ్ = జీవించుట | నింద్ = నిందించుట |
| ఉఞ్ఛ = పొడుచుట | మిహ్ = మూత్రము చేయుట |
| గర్జ్ = గర్జించుట | చుత్ (చోత్) = కారుట |
| వాంఛ్ = కోరుట | శుచ్ (శోచ్) = శోకించుట |
| క్రీడ్ = ఆడుట | గళ్ = కరగుట |

చుంబ్ = ముద్దు పెట్టుకొనుట క్రుశ్ (క్రోశ్) = మొత్తుకొనుట

కృష్ = (కర్ష) లాగుట దంశ్ (డశ్) = పళ్ళతో కొరుకుట

ఘ్రా (జిఘ్ర) వాసనచూచుట సద్ (సీద్) = దుఃఖము పొందుట

మ్నా (మన్) మననము చేయుట దృశ్ (పశ్య) చూచుట

స్థా (తిష్ఠ) నిలుచుట ధ్మా (ధమ్) ఊదుట

గమ్ (గచ్ఛ) = వెళ్లుట పా (పిబ్) త్రాగుట

అనువాదము :

వయం బోధామః. వయం ధావామః. వయం క్రోశామః. వయం క్ష్వేడామః తే పఠంతి. తే దహంతి. తే జయంతి. తే రక్షంతి. తే వదంతి. తే స్మరంతి. యూయం వదథ. యూయం నయథ. యూయం దహథ. యూయం జీవథ.

మేము చదువుచున్నాము. మేము పూజించుచున్నాము. మేము రక్షించుచున్నాము. మేము చెప్పుచున్నాము. వారు ఆడుచున్నారు. వారు పిలుచుచున్నారు. వారు పరుగెత్తుచున్నారు. వారు తెలిసికొనుచున్నారు. నీవు తిరుగుచున్నావు. నీవు నిందించుచున్నావు. నీవు దున్నుచున్నావు. నీవు కోరుచున్నావు.

శబ్దకోశము :

| | | | | | |
|---|---|---|---|---|---|
| దుఃఖమ్ | (న) | దుఖము | బాలకః | (పు) | బాలకుడు |
| పుష్పం | (న) | పువ్వు | మేఘః | (పు) | మేఘము |
| పత్రం | (న) | పత్రము | క్షేత్రం | (న) | పొలము |
| మిత్రం | (న) | మిత్రుడు | హస్తః | (న) | హస్తము |
| కుసుమం | (న) | కుసుమం | గజః | (పు) | ఏనుగు |

జలం (న) జలము　　వృశ్చికః (పు) తేలు
చందనం (న) చందనము　　మశకః (పు) దోమ

అనువాదము :

వృశ్చికః దశతి. వయం యజామః దుఃఖాని భవంతి. పత్రే పతతః. మిత్రం స్మరతి. తే జలం పిబంతి. బాలకాః శోచంతి. సింహాః శ్వేదంతి. వయం చందనం ఘర్షామః. పత్రాణి పతంతి. బాలకాః గచ్ఛంతి. గజాః సీదంతి.

నేను అభ్యసించుచున్నాను. నీవు చూచుచున్నావు. మీరు దుఃఖించుచున్నారు. మేము చూచుచున్నాము. నేను వెళ్ళుచున్నాను. నేను ఇచ్చుచున్నాను. వారు త్రాగుచున్నారు. వారిద్దరు చూచుచున్నారు. వారిద్దరు చెప్పుచున్నారు. మీరిద్దరు నిందించుచున్నారు.

## ఆత్మనేపద విధానము (భ్వాదిగణము)

లట్ లకారముయొక్క ప్రత్యయములు

| | | |
|---|---|---|
| తే | ఆతే | అంతే |
| సే | ఆథే | ధ్వే |
| ఏ | వహే | మహే |

పై ప్రత్యయములు చేరిన తర్వాత కంప్ ధాతువన కేర్పడు రూపములు.

| | | |
|---|---|---|
| కంపతే | కంపేతే | కంపంతే |
| కంపసే | కంపేథే | కంపధ్వే |
| కంపే | కంపావహే | కంపామహే |

1. 'అ' తర్వాత ఆతే మరియు 'ఆథే'లు వచ్చిన 'ఆ' కు ఈ యగును. కంప్ అ ఆతే = కంప ఈతే = కంపేతే కంప్ + అ + ఆథే = కంప + ఇథే, కంపేథే, అ + ఇ = ఎ

2. ఏ మరియు అంతే ప్రత్యయము పరముగా వచ్చిన 'అ' లోపించును. కంప్ అ ఏ = కంప్ ఏ = కంపే. కంప్ అ అంతే + కంప్ + అంతే = కంపంతే.

ఇదే విధముగా నిమ్నాంకిత ధాతువులకు లట్ లకారములో రూపములు వ్రాయుడు.

ధాతుపాఠము :

| | |
|---|---|
| ఈక్ష = చూచుట | సేవ్ = సేవచేయుట |
| పరి + ఈక్ష (పరీక్ష) పరీక్షించుట | శఙ్క = శంకించుట |
| ప్ర = కాశ్ = ప్రకాశించుట | ముద్ (మోద్) ప్రసన్నుడగుట |
| భాష్ = మాటాడుట | |
| వంద్ = ప్రణామము చేయుట | యత్ = యత్నించుట |
| వృత్ = (వర్త్) జరుగుట | రమ్ = రమించుట, ఆడుట |
| వృద్ = (వర్ధ) పెరుగుట | రుచ్ = (రోచ్) రుచించుట |
| సహ్ = సహించుట | లభ్ = లభించుట |
| కంప్ = కంపించుట | శుచ్ = శుభమగుట |
| శిక్ష్ = నేర్చుకొనుట | భిక్ష్ = భిక్షయడుగుట |
| ఆ = రభ్ = ఆరంభించుట | యాచ్ = యాచించుట |
| ఆ = శంస్ = ఆశాచేయుట | స్యంద్ = కారుట |

అనువాదము :

శిష్యో గురోర్న్యాయం శిక్షతే. హరయే ఆమ్రం రోచతే. ధనమాశంసంతే. వ్యాకరణం శిక్షావహే. ఆవాం జృంభావహే. తౌ పరీక్షేతే బాలకాన్. ఆహం త్వయి స్రంభే. త్వం గురుం సేవసే. తే తస్మిన్ శజ్జన్తే. తే అసత్యం భాషంతే. అహం ధనాయ యతే. అహమీశ్వరేరమే. గురుః శిష్యం పరీక్షతే. గురుం వందసే. తే ఘోటకమీక్షంతే. వయం త్వాం పరీక్షామహే.

శబ్దకోశము :

ఘోటకః = గుఱ్ఱము, భర్తృ = పతి, ధ్రువమ్ = నిశ్చయమైన, భార్యా = స్త్రీ, ఆశు = శీఘ్రముగా, న్యాయః = న్యాయము, యత్ర = అచ్చట, తథైవ = అదేవిధముగా, తుభ్యం = నీకొరకై, భయమ్ = భయము, కార్యమ్ = కార్యము. ప్రకాశః = ప్రకాశము, అసత్యమ్ = అసత్యము, లేఖః = వ్యాసము, శీతలమ్ = చల్లని, ఉచ్చైః = గట్టిగా, అధ్యయనమ్ = చదువుట, వేతనమ్ = వేతనము.

అనువాదము :

అతను భయముచే కంపించును. వారు పని ప్రారంభింతురు. అతను అసత్యము చెప్పును. మీరు ధనమునకై యత్నించుదురు. నా పుత్రులు దుఃఖము సహింతురు. మేము లేఖను పరీక్షింతుము. వారు ఒంటికన్నుతో చూచెదరు. నేను నీకు చల్లటి నీరు ఇత్తును. మీపై విశ్వాసముంచుదును. మేము గురువునకు ప్రణామము చేయుదుము. వృక్షము ప్రకాశము చేత పెరుగును. వారిద్దరు భిక్షాటన చేయుదురు. మేమిద్దరము కళా నేర్చుకొందుము. వారు గట్టిగా చెప్పుదురు. నేను చదువు ప్రారంభింతును.

## 2. అదాదిగణము :

అదాదిగణములో "అది ప్రభృతిభ్యః శపః" (2-4-72) అను సూత్రము చేత "శప్" వికరణము లుక్ (అదర్శనం) అగును. అద్ + తి = అత్ + తి = అత్తి. కేవలము సంక్షిప్త జ్ఞానార్థాము లట్ లకారము యొక్క రూపములు ఈ విధముగా నుండును.

పరస్మై పదము (వర్తమాన కాలములో)

| | | |
|---|---|---|
| అత్తి | అత్తః | అదంతి |
| అత్సి | అత్థః | అత్థ |
| అద్మి | అద్వః | అద్మః |

ధాతు పాఠము :

| | |
|---|---|
| స్తు = స్తుతించుట | వచ్ = వచించుట |
| ఇ = వెళ్లుట | విద్ = తెలుసుకొనుట |
| యా = తీసుకెళ్లుట | జాగృ = మేలుకొనుట |
| భా = ప్రకాశించుట | శాస = శాసించుట |
| స్నా = స్నానము చేయుట | వశ్ = కాంతి |
| శ్రా = వండుట | పా = రక్షించుట |
| దా = దానము చేయుట | దా = కోయుట |
| ఖ్యా = ఉపన్యసించుట | మా = కొలుచుట |

ఆత్మనే పదము (వర్తమాన కాలములో)

ద్విశ్ = అప్రితి

| | | |
|---|---|---|
| ద్విష్టే | ద్విషాతే | ద్విషతే |
| ద్విక్షే | ద్విషాథే | ద్విడ్ఢ్వే |
| ద్విషే | ద్విష్వయే | ద్విష్మయే |

ధాతు పాఠము :—

చక్ష్ = స్పష్టముగా చెప్పుట, చూచుట

ఈశ్ = ప్రభువు

ఆస్ = కూర్చుండుట

సూ = పుట్టుట

షీ = నిద్రించుట

బ్రూతే = చెప్పుట

ఇ = అధ్యయనము చేయుట

3. జుహోత్యాదిగణము

జుహోత్యాదిగణము "జుహోత్యాదిభ్యః శ్లుః" (2-4-75) చేత "శ్లు" వికరణ మేర్పడును. (అనగా లోపించుట) ప్రత్యయము చేర్చుటకు పూర్వము ధాతువునకు పూర్వమున్న స్వర సహిత వ్యంజనమునకు ద్విత్వ మేర్పడును. ఈ గణమునందు 'అంతి' 'అతి' గాను మరియు అంత స్థానము 'అత'గా మారును. ఇ, ఉ, ఋ లకు గుణమేర్పడును. ఉదా : హు (హవనము చేయుట) హు + తి = హు + హు + తి = జు + హు + తి = జు + హో + తి = జుహోతి యగును.

పరస్మైపదము.

| | | |
|---|---|---|
| జుహోతి | జుహుతః | జుహ్వతి |
| జుహోషి | జుహుథః | జుహుథ |
| జుహోమి | జుహువః | జుహుమః |

ధాతు పాఠము :

భీ = భయపడుట

విష్ = వ్యాపించుట

హ్రీ = సిగ్గుపడుట
పృ = పాలించుట,
పూర్ణము చేయుట
హా = త్యాగము చేయుట
ఋ = వెళ్లుట
గౄ = స్తుతించుట
దా = దానము చేయుట
ధా = ధరించుట,
పోషించుట

ఆత్మనే పదము

హా = వెళ్లుట

| | | |
|---|---|---|
| జిహీతే | జిహాతే | జిహతే |
| జిహీషే | జిహీథే | జిహీధ్వే |
| జిహే | జిహీవహే | జిహీమహే |

ధాతు పాఠము :

మాం = పూజించుట
భ్రీ = ధరించుట, పోషించుట
విజ్ = విభజించుట

4. దివాదిగణము

"దివాదిభ్యశ్శ్యన్" (3_1_69) చేత ఈ గణములోని ధాతువులకు పరముగా 'య' నుంచి ప్రత్యయములు చేర్చబడును. ఈ గణమునందు ఇ,ఉ,ఋ, లకు గుణము జరుగదు.

ఉదాహరణము.

ముహ్ + య + తి = ముహ్యతి (మూర్ఛితుడగుట)
నశ్ + య + సి = నశ్యసి (నశించుచున్నావు)

## పరస్మైపదము

| | | |
|---|---|---|
| నశ్యతి | నశ్యతః | నశ్యంతి |
| నశ్యసి | నశ్యథః | నశ్యథ |
| నశ్యామి | నశ్యావః | నశ్యామః |

ధాతుపాఠము

సివ్ (సీవ్) కుట్టుట
ష్ఠివ్ (ష్ఠీవ్) ఉమియుట
పుష్ = పాలించుట
స్నిహ = స్నేహముచేయుట
ఋధ్ = పెరుగుట
నశ్ = నశించుట
జౄ (జీర్) జీర్ణమగుట
లుభ్ = లోభియగుట
తుష్ = ప్రసన్నుడగుట
శ్లిష్ = ఆలింగనము చేయుట
క్లిశ్ = క్లేశపడుట
గుప్ = జంకుట
యస్ = ప్రయాస పడుట
శ్రమ్ (శ్రామ్) అలసట
క్షమ (క్షామ) క్షమించుట
హృష్ = ప్రసన్నుడగుట
శుష్ = వెండుట
దుష్ = చెడిపోవుట
భ్రమ్ (భ్రామ్) తిరుగుట

శుధ్ = శుద్ధముగా నుండుట
కుప్ = క్రోధము చేయుట
కృశ్ = బలహీనుడగుట
స్విద్ = చెమట పోయుట
క్షుభ్ = చంచలుడగుట
క్రుధ్ = క్రోధము చేయుట
అభ్యస్ = అభ్యాసము చేయుట
లుప్ = లోపము జరుగుట
వ్యధ్ = (విధ్) వేధనాపడుట
లుట్ = పరుండుట
అస్ = పారవేయుట
ద్రుహ = ద్రోహము చేయుట
సిధ్ = సిద్ధించుట
శమ్ = (శామ్) శాంతియగుట
దమ్ = (దామ్)దమనముచేయు[illegible]
(చెడ్డ కోరిక నుండి మనస్సున
తప్పించుట)
క్లమ్ (క్లామ్) అలసట చెందు[illegible]

యుద్ = యుద్ధము చేయుట    ఖిద్ = దుఖించుట
అవ + మన్ = అవమానించుట

అత్మనేపదము

| | | |
|---|---|---|
| దీప్యతే | దీప్యేతే | దీప్యంతే |
| దీప్యసే | దీప్యేథే | దీప్యధ్వమ్ |
| దీప్యే | దీప్యావహే | దీప్యామహే |

ధాతుపాఠము :

లీ = దాగుండుట    ప్రతి + పర్ = ద్వీకరించుట
ఆ + దృ (ద్రియ్) = ఆదరించుట    మృ (మియ్) = చచ్చుట

అనువాదము :

బుధాః తుష్యంతి. బాలకాః అభ్యస్యంతి. గజాః జలం పిబంతి. రామః ముఖేన శంఖం ధమతి. రామః ఋషిం నమతి. పుత్రః ఊర్ధ్వ పశ్యతి. బాలకః రిఙ్గతి. ఆపణికః జలం యచ్ఛతి. వృక్షాః జీర్యంతి. కమలాని జలే నృత్యంతి. రామః మిత్రం స్మరతి. దుఃఖం భవతి. ఇంధనం జ్వలతి. గజాః గచ్ఛంతి. అహమీశ్వరం ధ్యాయామి. తే ఉష్ణం దుగ్ధం పిబంతి. తే అభినవం కుసుమం జిఘ్రంతి. చిత్తం క్లేశేన గ్లాయతి, ఋషయః ఇంద్రియాణి జయంతి. సూద, ఇంధనేన భోజనం పచతి.

శబ్దకోశము

శంస = ప్రశంచించుట మూర్ఖః = (పు) మూర్ఖుడు కుక్కురః = కుక్క. కటః = చాప. కమలం(న) = కమలము. తంతువాయః = సాలెవాడు. వస్త్రం = బట్టలు. శిష్యః = శిష్యుడు. శరీరం = శరీరము. పిష్టకం = రొట్టె, పర్వతః = పర్వతము. వృక్షః = వృక్షము. పుత్రః = పుత్రుడు. కృషాణః = వ్యవసాయదారుడు. బీజం = బీజము. అశ్వః =

గుల్మము. కోశః = ధనాగారము. ప్రస్తరః = రాయి. బుధః = చతురుడు.
ఆపణికః = వ్యాపారి. ఉష్ణ (వి) = వేడి దుగ్ధం = పాలు. అభినవ (వి) = క్రొత్తది. రశ్మిః = త్రాడు. సూదః = వంటపనివాడు. ఊర్ధ్వమ్ (అ) పైకి. ఉష్ట్రిః = ఒంటె. గర్ధభః = గాడిద. పరస్పరం = పరస్పరము. బుద్ధిః = బుద్ధి. కార్యమ్ = కార్యము. పితా = తండ్రి. మార్గః = మార్గము. మమ = నాయొక్క. అగ్నిః = అగ్ని. పవనః = గాలి. హృదయమ్ = హృదయము. పరిశ్రమః = పరిశ్రమ. గురుః = గురువు. శిష్యః = శిష్యుడు. సూర్యః = సూర్యుడు. కిరణః = కిరణము. కాసారః = చెఱువు. మక్షికా = ఈగ. కేశః = వెంట్రుకలు. శావకః = పిల్లలు. ఆఖేటకః = శిఖారీ. ఇషుః = బాణము. సరటా = తేనెటీగ. కరిన్ = ఏనుగు. తరుః = వృక్షము. ఆతపః = ఎండ. ఉదధిః = సముద్రము. అరిః = శత్రువు. శచీపతిః = ఇంద్రుడు. సూనుః = పుత్రుడు. అనిలః = గాలి. నహి = లేదు. సుప్త = పరుండిన, తరణిః = సూర్యుడు.

అనువాదము :

మూర్ఖుడు క్రోధము చేయును. కమలములు నీటిలో ఆడును. పుత్రుడు ప్రసన్నుడగును, పిల్లవాడు నీటిలో ఉమియును. నీవు ఆలింగనము చేయుదువు. మేఘములు గర్జించును. పిల్లలు ఆడుదురు కుక్క మొరగును. వారు చాపపై పరుండెదరు. శిష్యుడు గురువునకు నమస్కరించును. మోహనుడు రొట్టె చేయును. వారు రాతిపై చందనము తీయుదురు. హరి మిత్రులను స్మరించును. వ్యవసాయదారుడు పొలములో బీజములను నాటును, బుద్ధిద్వారా కార్యము సిద్ధించును. పిల్లవాడు కుసంగముచే పాడై పోవును. పిత పుత్రుని ఆలింగనము చేయును. పిల్లలు మార్గమున వెళ్లుదురు. నాతల తిరుగుచున్నది. వారు రాల్లు రువ్వుదురు. నీటిలో గుడ్డ తడియును వాడు రామునితో స్నేహము చేయును. దుఃఖము వలన హృద

యము చంచలమగును. పిల్లవాండ్రు పరిశ్రమచేత అలసట చెందుదురు. గురువు శిష్యులను క్షమించును. చెఱువులోని నీరు ఎండిపోవును. బుద్ధి జ్ఞానము వలన శుద్ధమగును.

## 5. స్వాదిగణము

"స్వాదిభ్యః శ్నుః" (అ. 3-1-73) చేత 'ను' అగును. ప్రత్యయ సంబంధములగు వకార మకారములకు పూర్వమున్న 'ను'లోని 'ఉ' వికల్పముగా లోపించి "న్" మిగులును. ధాతువునకు అంతమున స్వరముండిన అజాది ప్రత్యయములకు పూర్వమున్న 'ను' "న్వ్"గా మారును. ధాతువునకు అంతమున హల్లు యుండనచో అజాది ప్రత్యయము పరముగా నున్నప్పుడు "ఉవ్" వచ్చును. అజంత ధాతువునకు పరముగా లోట్ లకారములో "హి" యొక్క లోపము జరుగును.

ఉదా:- సు (అభిషేకించుట)

పరస్మైపదము

| | | |
|---|---|---|
| సునోతి | సునుతః | సున్వంతి |
| సునోషి | సునుథః | సునుథ |
| సునోమి | సునువః | సునుమః |

ధాతుపాఠము :

ధృష్ = ప్రాగల్భము చెప్పుట
దంభ్ = దాంభికముచేయుట
తృ = సంతోషపెట్టుట
చమ్ = భక్షించుట
దాశ్ = హింసించుట
ప్రృ = ప్రీతిచేయుట
ఆప్ = ప్రాప్తించుట
శక్ = సామర్థ్యముగా నుండుట
రాధ్ = సాధించుట

ఆత్మనేపదము

| | | |
|---|---|---|
| అశ్నుతే | అశ్నువాతే | అశ్నువతే |
| అశ్నుషే | అశ్నువాథే | అశ్నుధ్వే |
| అశ్నువే | అశ్నువహే | అశ్నుమహే |

ధాతుపాఠము :

సు = అభిషేకించుట
సి = బంధనము
మి = పారవేయుట
చి = ప్రోగుచేయుట
స్తృ = కప్పుట
వృ = వరించుట
ధు = కంపించుట

6. తుదాదిగణము

"తుదాదిభ్యః శః" (అ. 3-1-77)చేత ధాతువునకు పరముగా 'అ' వికరణము ఏర్పడును మరియు దీనిలో ఇ, ఉ, ఋ లకు గుణము జరుగదు.

పరస్మైపదము

| | | |
|---|---|---|
| తుదతి | తుదతః | తుదంతి |
| తుదసి | తుదథః | తుదథ |
| తుదామి | తుదావః | తుదామః |

ధాతుపాఠము :

తుద్ = దుఃఖము కలిగించుట
నుద్ = ప్రేరేపించుట
వ్రశ్చ్ = కోయుట
సృజ్ = సృష్టించుట
కృష్ = దున్నుట
లుభ్ = మోహితుడగుట
ముచ్ (ముఞ్చ్) = వదలివేయుట
లిప్ (లింప్) = అలకుట
కృత్ (కృంత్) = కోయుట
సిచ్ (సిఞ్చ్) = నీరుకట్టుట

| | |
|---|---|
| దిశ్ = ఉపదేశించుట | విద్ (వింద) పొందుట |
| సం + కుచ్ = సంకుచితమగుట | మజ్జ్ = మునుగుట |
| రుజ్ = విరుగుట | స్ఫుట్ = వికసించుట |
| కృష్ = దున్నుట | ఇష్ (ఇచ్ఛ) = కోరిక |
| గౄ (గిల్) = మ్రింగుట | క్షిప్ = పారవేయుట |
| ప్రచ్ఛ (పృచ్ఛ)=అడుగుట | ప్ర + విశ్ = ప్రవేశించుట |
| సృజ్ = చేయుట | వి + కౄ (కిర్) వేరుచేయుట |
| లగ్ = పెట్టుట | స్పృశ్ = ముట్టుకొనుట |
| గుంఫ్ = కట్టుట | లిఖ్ = వ్రాయుట |

## ఆత్మనేపదము

| | | |
|---|---|---|
| లజతే | లజేతే | లజంతే |
| లజసే | లజేథే | లజధ్వమ్ |
| లజే | లజావహే | లజామహే |

ధాతుపాఠము :

లజ్ = సిగ్గుపడుట

| | |
|---|---|
| పృ = వ్యాపారము చేయుట | విజ్ = వేగిరపడుట |
| మృ = చనిపోవుట | గుర్ = ప్రయత్నించుట |
| జుష్ = సేవించుట | కు = శబ్దము చేయుట |

అనువాదము :

గురుః బాలకాయ క్రుద్యతి. భృత్యః స్వామినే ద్రుహ్యతి. సః అధ్యయనాత్ప్రమాద్యతి. కవిషు కాళిదాసః శ్రేష్ఠః. హరిః దరిద్రేభ్యః ధనం ప్రయచ్ఛతి. బాలకః పుష్పం జిఘ్రతి. కమలం జలే ఇతస్తతః నృత్యతి. జనకః పుత్రం శ్లిష్యతి. సింహః నిర్జనే వనే క్ష్వేడతి. పంకే

పశుః సీదతి. జనకః పుత్రాయ శోచతి. ఘోటకః ఘంటాపథే వల్గతి. క్రీడాక్షేత్రే విద్యార్థినః క్రీడంతి. నూపురం రణతి. గురుః విద్యార్థిన. ధ్యాయతి. మానవా ధర్మేణ సుఖం విందంతి. కుడ్మలః ఝటితి స్ఫుటతి. కాపటికాః జనాన్ వఞ్చన్తి. భర్తుః స్వసారః ననాందరః భవంతి. హరిః కుడ్యే లిఖతి. నృపః జామాత్రే పారివర్హం యచ్ఛతి. భవాన్ కుత్ర గచ్ఛతి. స్కంధావారే సైనికాః తిష్ఠంతి. విద్యార్థీ మసీపాత్రే జలం క్షిపతి. రాజపురుషాః చోరం గుల్మే నయంతి. ఝామకేన అసిః శుధ్యతి. తడాగః ఆతపేన శుష్యతి. కుతః ఆగచ్ఛసి? తేక్షేత్రం కృషంతి.

శబ్దకోశము :

స్వామిన్ (పు) = స్వామి. భృత్యః = నౌకరు, అధ్యయనం = చదుట. ఇతస్తతః = ఇచ్చటచ్చట, నిర్జన = నిర్జనమైన, ఘోటకః = గుఱ్ఱము, ఘంటాపథః = త్రోవ, క్రీడాక్షేత్రం = ఆటస్థలము, మానవః = మనుష్యుడు, వ్యాధిః = రోగము, మత్కుణః = నల్లి, గోమయమ్ = ఆవు పేడ, పాపిన్ = పాపి, శైత్యం = చల్లదనము, వృశ్చికః = తేలు. ఝటితి = వెంటనే, కాపటిక = కపటి, స్వసా (స్వసృ) = సోదరి జామాతా (జామాతృ) = అల్లుడు, పారివర్హ = కట్నము, భవాన్ (భవత్) = మీరు, కుత్ర = ఎక్కడ, గుల్మం = పోలీసు స్టేషను, రాజ పురుషః = పోలీసువాడు. శనైః శనైః = మెల్లమెల్లగా, అర్థః = ధనము. కామః = కోరిక, ఏతాని = ఇవి, కృతః = ఎచ్చటనుండి, అరుహా = ఎక్కడ, కలభః = కలము. భ్రాతా (భ్రాతృ) = సోదరుడు. గృహమ్ = ఇల్లు, పాదః = కాలు, తటమ్ = ఒడ్డున, కుక్కుటః = కోడిపుంజు, మూషికః = ఎలుక, కార్షాపణః = పైస, మాతా (మాతృ) తల్లి పతాకా = జండా.

అనువాదము :

పిల్లలు కలముతో వ్రాయుదురు. సోదరుడు సోదరిని అడుగును. మేము ఇంటియందు ప్రవేశించెదము. నేను అన్నయ్య పాదములకు మ్రొక్కెదను. గంగ-జమునతో కలియును. నేడు నా కుడినేత్రము కదలు చున్నది. మొగ్గలు విప్పుకొనును. పిల్లి ఎలుకను తినివేయును. వాడు పైస లను భూమిపై పారవేయును. తల్లి చేతితో జండాను తాకును. పిల్లలు ఎండచే భయపడుదురు. తేలు మోహనుని కరచును. ఈశ్వరుడు ప్రపంచ మును సృష్టించును. వ్యాధి మోహనునకు దుఃఖము కలిగించును. సల్లులు కరచును. దాసీ పేడతో భూమిని అలుకును. సారథి గుఱ్ఱమును తోలును. పాపాత్ములు ధర్మమును నష్టపరతురు. నౌకరు వేతనము పొందును. వారు వృక్షములను నీటితో పెంచుదురు.

## 7. రుధాదిగణము

"రుదాదిభ్యః శ్నమ్" (అ. 7-1-78) చేత 'న' వికరణము వచ్చును. విశేష భేదము ఇతర గణ వికరణములోవలె 'న' ధాతువు యొక్క అంత మున చేర్చబడక ధాతువుయొక్క అంతిమ వ్యంజనమునకు పూర్వము చేర్చబడును. ఉదా;- రుధ్ (ఆపుట)రుధ్ + తి = రునధ్ + తి = రుణద్ధి.

### పరస్మై పదము

| | | |
|---|---|---|
| రుణద్ధి | రుద్ధః | రుంధంతి |
| రుణత్సి | రుద్ధః | రుద్ధ |
| రుణధ్మి | రుంధ్వః | రుధ్మః |

ధాతు పాఠము :

| | |
|---|---|
| కృత్ = ఛేదించుట | భంజ్ = విరగకొట్టుట |
| శిష్ = విశేషించుట | ఉంద = బాధపెట్టుట |

పిష్ = చూర్ణము చేయుట
విజ్ = భయపెట్టుట
అఞ్జ్ = కాంతి చేరుట
వృజ్ = త్యజించుట
పృచ్ = సంపర్కము చేయుట

ఆత్మనే పదము

| | | |
|---|---|---|
| వింతే | విందాతే | విందతే |
| వింత్సే | విందాథే | వింద్ధ్వే |
| విందే | వింద్వహై | విందమహే |

ధాతుపాఠము :

రుధ్ = ఆపుట
భిద్ = భేదించుట
ఛిద్ = ఛేదించుట
విచ్ = వేరుచేయుట
క్షుద్ = విచారించుట
యుజ్ = కలుపుట
ఇంధ్ = వెలిగించుట
విద్ = తెలుసుకొనుట

8. తనాదిగణము

"తనాది కృఞ్భ్యఉః" (అ. 3-1-79) చేత 'ఉ' వికరణమగును. తనాది గణముయొక్క ధాతువులకు రూపము స్వాదిగుణములోవలె నగును 'ఉ' వికరణమునకు పరముగా లోట్ లకారములో సర్వదా లోపమేర్పడును. ఉదా:- తన్ = విస్తరించుట.

పరస్మైపదము

| | | |
|---|---|---|
| తనోతి | తనుతః | తన్వంతి |
| తనోషి | తనుథః | తనుథ |
| తనోమి | తనువః-తన్వః | తనుమః-తన్మః |

ధాతుపాఠము:—

సన్ = దానముచేయుట
తృణ్ = తినుట

క్షిణ్ = హింసించుట          కృ = చేయుట

ఋణ్ = ప్రాప్తించుట

ఆత్మనేపదము

| | | |
|---|---|---|
| మనుతే | మనువాతే | మనువతే |
| మనుషే | మనువాథే | మనుధ్వే |
| మనువే | మనువహే | మనువహే |

9. క్ర్యాదిగణము :

"క్ర్యాదిభ్యః శ్నా" (అ. 3-1-81) చేత 'నా' వికరణము వచ్చును. హలాది ప్రత్యయములకు పూర్వము 'నా' 'నీ' గా మారును. మరియు స్వరాది ప్రత్యయములకు పూర్వము 'నా' నకు 'న్' అగును. ఉదా :- క్రీ (కొనుట).

క్రీ + నా + తః = క్రీనీ + తః = క్రీణీతః

క్రీ + నా + అంతి = క్రీ + న్ + అంతి = క్రీణంతి

హలంత ధాతువునకు లోట్ లకారములో 'హి' మరియు వికరణము రెండింటికిని 'ఆన' యగును. ఉదా :- గృహ + నా + హి = గృహ + ఆన = గృహాణ:

పరస్మైపదము

| | | |
|---|---|---|
| పుష్ణాతి | పుష్ణీతః | పుష్ణంతి |
| పుష్ణాసి | పుష్ణీథః | పుష్ణీథ |
| పుష్ణామి | పుష్ణీవః | పుష్ణీమః |

ధాతు పాఠము :

క్షుభ్ = క్షోభించుట     శ్రా = హింసించుట     భ్రా = భరించుట

| | | |
|---|---|---|
| అశ్ = భోజనము చేయుట | పౄ = పాలించుట | జౄ = ఆయువు క్షీణించుట |
| | వౄ = వరించుట | దౄ = ఛేదించుట |
| | భ్రీ = భయపెట్టుట | ఋ = ప్రాప్తించుట |
| | | గౄ = శబ్దము చేయుట |
| | | జ్ఞా = తెలుసుకొనుట |

ఆత్మనే పదము

| | | |
|---|---|---|
| క్రీణీతే | క్రీణాతే | క్రీణతే |
| క్రీణీషే | క్రీణాథే | క్రీణీధ్వే |
| క్రీణే | క్రీణీవహే | క్రీణీమహే |

ధాతు పాఠము :

| | |
|---|---|
| వృ = వేరు చేయుట | యు = బంధించుట |
| ప్రీ = తర్పణము చేయుట | పూ = పవిత్రము చేయుట |
| శ్రీ = పాకము చేయుట | లూ = ఛేదించుట |
| సి = బంధించుట | ధృ = కండించుట |
| వౄ = వరించుట | గ్రహ = గ్రహించుట |

## 10. చురాదిగణము

"సత్య...చురాదిభ్యోణిచ్" (3-1-25) చేత ధాతువునకు పరముగ 'అయ' చేర్చబడును. మరియు ఉపధ యొక్క 'అ', 'ఆ'గా మారును ఉదా ;- తడ్ — తాడ్; పశ్ — పాశ్. ఉపధ యొక్క 'ఇ ఉ ఋ' లకు గుణమేర్పడును. అంతమునందున్న 'ఇ ఉ ఋ' లకు వృద్ధి యగును 'ఇ'నకు 'ఐ', 'ఉ' నకు 'ఔ' మరియు 'ఋ'నకు 'ఆర్' వృద్ధియగును (వృద్ధిరాదైచ్.)

పరస్మైపదము

| | | |
|---|---|---|
| చోరయతి | చోరయతః | చోరయంతి |
| చోరయసి | చోరయథః | చోరయథ |
| చోరయామి | చోరయావః | చోరయామః |

ధాతుపాఠము :

| | |
|---|---|
| చుర్ (చోర్) దొంగిలించుట | పీడ్ = పీడించుట |
| క్షల్ (క్షాల్) ఉతుకుట | తుల్ (తోల్) కొలుచుట |
| తిజ్ (తేజ్) = ప్రకాశింప జేయుట | చింత్ = స్మరించుట |
| ప్రథ = విస్తరించుట | కథ = చెప్పుట |
| గణ = లెక్కించుట | వర = వరించుట |
| ప్రేష = పంపించుట | స్పృహ = కోరుట |
| సాన్త్వ = సాన్త్వనము చేయుట | భూష = అలంకరించుట |
| ప్రీ (ప్రీణ్) ప్రసన్నము చేయుట | తడ్ (తాడ్) కొట్టుట |
| మార్గ = వెదుకుట | దండ్ = దండించుట |
| దుష = (దూష) చెప్పుట | అర్జ్ = పుట్టించుట |
| వీజ్ = గాలి విసరుట | పూజ్ = పూజించుట |
| వద్ = వాయించుట | వృజ్ (వర్జ) = నిషేధించుట |
| అంక్ = చిహ్నము చేయుట | పాల్ = పాలించుట |
| పశ్ = కట్టుట | దృ = చించుట |

ఆత్మనేపదము

| | | |
|---|---|---|
| చేతయతే | చేతయేతే | చేతయంతే |
| చేతయసే | చేతయేథే | చేతయధ్వమ్ |
| చేతయే | చేతయావహే | చేతయామహే |

ధాతుపాఠము :

చిత్ = ఆలోచించుట
తంత్ర్ = పోషించుట
మంత్ర్ = గుప్తపరచుట
యక్ష్ = పూజించుట
కుత్స్ = నిందించుట
త్రుట్ = విరగుట

శబ్దకోశము :

ఉపశమః = శాంతి, ఉత్థానక = పైకెత్తు యంత్రము, సుఖిన్ = సుఖవంతమైన, అద్య = నేడు, ప్రతి = ప్రతిదీ, ద్విచక్రయాన్ = సాయకిలు, సంధి = కలియుట. అర్భకః = పిల్లవాడు, నిలంబిత = తాలించుట, దూరభాష = టెలిఫోను, ఉపవనమ్ = ఉపవనము, దూరదర్శన = టెలివిజను, దూర ముద్రణ = టెలీప్రింటర్.

అనువాదము :

భాషన్తాం బాలకాః సర్వే. భవతు తావద్ వృష్టేరుపశమః. సర్వే సుఖినః భవంతు. అధ్యయనముపక్రమస్వ. వ్యయధ్వం సర్వాణి ధనాని. అనుకంపస్వ మయి సేవకే. కమపి గురుజనం మావమన్యధ్వమ్. తైః సహాయుధ్యధ్వమ్. పలాయస్వ సత్వరమ్. అద్యైవ ప్రతిష్ఠస్వ కాశీం ప్రతి. ధనాయ యతధ్వమ్. యతతాం సంధ్యై. శిక్షధ్వం వ్యాకరణమ్. పరివర్తస్వ స్వగృహం ప్రతి. అమీ అర్భకాః పరివర్తన్తామ్.

ద్వి వచనాంత ఏకార ఈకార మరియు ఊకారములకు సంధి జరుగదు. యథా = కవీ ఇమౌ. గిరీ ఏతౌ. బంధూ ఆగతౌ. లతే ఏతే. సాధూ ఆగాతవంతౌ. ఇషూ ఏతౌ. బాలికే ఇమే రామస్యో పవనాత్ఫలానీ తామ్. మునీ ఇమౌ వాల్మీకేరాశ్రమే విద్యాం శిక్షేతామ్. సాధూ ఇమౌ. పురుషౌ గురుం వందేతామ్.

అదస్ శబ్దము యొక్క మకారమునకు పరముగా ఈ, ఊ లకు సంధి జరుగదు. అమీ అశ్వాః, అమీ ఇషవః. అమూ అర్భకౌ.

# 6. సుబంత ప్రకరణము

సంస్కృత భాషయందు నామమునకుమూడు వచనములు మూడు లింగములు, 6 కారకములు మరియు ఏడు విభక్తులు గలవు. అందువలన నొక్కొక్క శబ్దమునకు మూడు వచనములలో 21 రూపము లుండును.

సంస్కృత భాషయందు కారకముల విభక్తులు.

| విభక్తులు | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| 1. ప్రథమా | సు (ః) | ఔ | జస్ (అస్) |
| 2. ద్వితీయా | అమ్ | ఔట్ (ఔ) | శస్ (అస్) |
| 3. తృతీయా | టా (ఆ) | భ్యాం | భిస్ (భిః) |
| 4. చతుర్థీ | ఙే (ఏ) | భ్యాం | భ్యస్ (భ్యః) |
| 5. పంచమీ | ఙసి (అస్) | భ్యాం | భ్యస్ (భ్యః) |
| 6. షష్ఠి | ఙస్ (అస్) | ఓస్ (ఓః) | ఆమ్ |
| 7. సప్తమీ | ఙి (ఇ) | ఓస్ (ఓః) | సుప్ (సు) |

ఈ విభక్తులకే సుప్ 'సుప్' అని పేరు. 'సుప్' అనునది ప్రత్యాహారము. ఈ సుప్పులచే ఏశబ్దములు సిద్ధించునో, వానిని సుబంతము లందురు.

పై సుప్పులు శబ్దము (ప్రాతిపదికము) లతో చేర్చిన నామములకు ఏర్పడు రూపములు ఈక్రింది విధముగా నుండును. కుండలీకరణములో నున్న శుద్ధరూపములనే చేర్చవలసి యుండును. ఎందుచేతననగా అవి వ్యాకరణ నియమములచేత మార్పు చెందిన రూపములు.

అకారాంత పుంలింగ 'దేవ' శబ్దమునకు నియమ బద్ధముగా పై ప్రత్యయము (సుప్) లను చేర్చిన ఏర్పడురూపములు, వాటికి సమానమైన తెలుగు విభక్తి ప్రత్యయములను చూపఁబడుచున్నవి

| విభక్తి | తెలుగు అర్థములు | కారకము |
|---|---|---|
| ప్రథమా | డు, ము, వు, లు | కర్త |
| ద్వితీయా | నిన్, నున్, లన్ | కర్మ |
| తృతీయా | చే, చేతన్, తో, తోడన్ | కరణము |
| చతుర్థీ | కొఱకు, కై | సంప్రదానము |
| పంచమీ | వలన, కంటె, పట్టి నుండి | అపాదానము |
| షష్ఠీ | యొక్క, లోపల, కున్ | సంబంధము |
| సప్తమీ | అందున్, నన్ | అధికరణము |
| సంబోధన ప్రథమా | ఓ, (హే) | సంబోధనము |

| విభక్తి | ఏ.వ. | ద్వి.వ. | బ.వ |
|---|---|---|---|
| ప్రథమా | దేవః | దేవౌ | దేవాః |
| ద్వితీయా | దేవమ్ | దేవౌ | దేవాన్ |
| తృతీయా | దేవేన | దేవాభ్యామ్ | దేవైః |
| చతుర్థీ | దేవాయ | దేవాభ్యామ్ | దేవేభ్యః |
| పంచమీ | దేవాత్-ద్ | దేవాభ్యామ్ | దేవేభ్యః |
| షష్ఠీ | దేవస్య | దేవయోః | దేవానామ్ |
| సప్తమీ | దేవే | దేవయోః | దేవేషు |
| సంబోధనము | హే దేవ | హే దేవౌ | హే దేవాః |

అభ్యాసము :- 'దేవ' శబ్దముపలె ఈక్రిందివానికి రూపావలి చేయుడు.

అభిమాన, ఇంద్ర, ఉత్సవ, ఋషభ, ఏకాంత, కర్ణధార, గోవింద, ఘట, చంద్ర, ఛాత్ర, జనక, దంత, ధనేశ, నర, పట, ఫల్గున, బాలక, మనోహర, యజ్ఞ, రమేశ, వల్లభ, శశిధర, సమయ, హస్త మొదలగునవి.

అకారాంత నపుంసకలింగ "ఫల" శబ్దరూపము-ఫలము

| | | |
|---|---|---|
| ఫలమ్ | ఫలే | ఫలాని |
| ఫలమ్ | ఫలే | ఫలాని |
| ఫలేన | ఫలాభ్యామ్ | ఫలైః |
| ఫలాయ | ఫలాభ్యామ్ | ఫలేభ్యః |
| ఫలాత్ | ఫలాభ్యామ్ | ఫలేభ్యః |
| ఫలస్య | ఫలయోః | ఫలానామ్ |
| ఫలే | ఫలయోః | ఫలేషు |
| హే ఫల | హే ఫలే | హే ఫలాని |

అభ్యాసము :- అమర, అనృత, ఆసన, ఇంద్రియ, ఉదర, ఉద్యాన, ఉత్థాన, కనక, గగన, గీత, గృహ, ఘృత, చరిత, చిత్ర, జల తీర్థ, దల, ద్రవ్య, దిన, ధన, నగర, నేత్ర, నిధన, పాత్ర, ప్రధాన, ప్రమాణ, భవ్య, భాగ్య, మూల్య, యంత్ర, రహస్య, రత్న, వసన్య వీర్య, శరణ, శయన, శాసన, సాధన, సుఖ, సంగీత, హిరణ్య, మొదలగునవి.

ఆకారాంత స్త్రీలింగ "లతా" శబ్దము

| | | |
|---|---|---|
| లతా | లతే | లతాః |
| లతామ్ | లతే | లతాః |
| లతయా | లతాభ్యామ్ | లతాభిః |

| | | |
|---|---|---|
| లతాయై | లతాభ్యామ్ | లతాభ్యః |
| లతాయాః | లతాభ్యామ్ | లతాభ్యః |
| లతాయాః | లతయోః | లతానామ్ |
| లతాయామ్ | లతయోః | లతాసు |
| హే లతే | హే లతే | హే లతాః |

అభ్యాసము :- అజా, ఆజ్ఞా, ఇచ్ఛా. ఉమా, కన్యా, గంగా, ఘటికా, చింతా, ఛాయా, జనతా, తారా, దశా, పత్రికా, పాఠశాలా, బాలికా, భాషా, మాలా, యాత్రా, రమా, రేఖా, లజ్జా, వసుధా, శోభా, సీతా, సేనా, హేమా మొదలగునవి.

ఇకారాంత పుంలింగ 'ముని' శబ్దము

| | | |
|---|---|---|
| మునిః | మునీ | మునయః |
| మునిమ్ | మునీ | మునీన్ |
| మునినా | మునిభ్యామ్ | మునిభిః |
| మునయే | మునిభ్యామ్ | మునిభ్యః |
| మునేః | మునిభ్యామ్ | మునిభ్యః |
| మునేః | మున్యోః | మునీనామ్ |
| మునౌ | మున్యోః | మునిషు |
| హే మునే | హే మునీ | హే మునయః |

అభ్యాసము :

అగ్ని. అతిథి, అద్రి. అరి, అరధి, అసి, ఉపాధి. ఋషి, కవి, కలి, కృమి, కేలి, గిరి, గ్రంధి, ధ్వని, నాభి. నిధి, పరిధి, పాణి, బలి, మణి, మరీచి, యతి, రవి, రశ్మి, రాశి, వనస్పతి, విధి, వ్యాధి. శుచి, సంధి, సన్నిధి, సమాధి, సారధి, హరి, హేమాద్రి మొదలగునవి.

ఇకారాంత స్త్రీలింగ 'మతి' శబ్దము—బుద్ధి

| | | |
|---|---|---|
| మతిః | మతీ | మతయః |
| మతిమ్ | మతీ | మతీః |
| మత్యా | మతిభ్యామ్ | మతిభిః |
| మత్యై, మతయే | మతిభ్యామ్ | మతిభ్యః |
| మత్యాః, మతేః | మతిభ్యామ్ | మతిభ్యః |
| మత్యాః, మతేః | మత్యోః | మతీనామ్ |
| మత్యామ్, మతౌ | మత్యోః | మతిషు |
| హే మతే | హే మతీ | హే మతయః |

అభ్యాసము :

అవనతి, అపచితి, ఉన్నతి, ఉత్పత్తి, కాంతి, కృతి, క్షతి, గతి. చితి, ఛవి, జాతి, తిథి, ధృతి, నీతి, ప్రకృతి, ప్రాప్తి, భూతి, మూర్తి, యువతి, రాత్రి, విపత్తి, వసతి, శక్తి, సమితి, స్మృతి, హాని, భక్తి, ముక్తి, స్తుతి, విరక్తి, బుద్ధి, ఆసక్తి, శృతి మొదలగునవి.

ఇకారాంత నపుంసకలింగ 'వారి' శబ్దము—నీరు

| | | |
|---|---|---|
| వారి | వారిణీ | వారీణి |
| వారి | వారిణీ | వారీణి |
| వారిణా | వారిభ్యామ్ | వారిభిః |
| వారిణే | వారిభ్యామ్ | వారిభ్యః |
| వారిణః | వారిభ్యామ్ | వారిభ్యః |
| వారిణః | వారిణోః | వారీణామ్ |
| వారిణి | వారిణోః | వారిషు |
| హే వారే, వారి | హే వారిణీ | హే వారీణి |

అభ్యాసము :— అక్షి, అస్థి, సక్థి మొదలగునవి.

ఈ కారాంత పుంలింగ "సేనాని" శబ్దము—సేనాధిపతి

| | | |
|---|---|---|
| సేనానీః | సేనాన్యౌ | సేనాన్యః |
| సేనాన్యమ్ | సేనాన్యౌ | సేనాన్యః |
| సేనాన్యా | సేనానీభ్యామ్ | సేనానీభిః |
| సేనాన్యే | ,, | సేనానీభ్యః |
| సేనాన్యః | ,, | ,, |
| సేనాన్యః | సేనాన్యోః | సేనాన్యామ్ |
| సేనాన్యామ్ | సేనాన్యోః | సేనానీషు |

అభ్యాసము :

గ్రామణీ, అగ్రణీ, యజ్ఞనీ, సుదీ మొదలగునవి.

ఈకారాంత స్త్రీలింగ 'నదీ' (నది), "శ్రీ" (లక్ష్మి) మరియు "స్త్రీ" (ఆడుది) శబ్దములు

| | | |
|---|---|---|
| నదీ | నద్యౌ | నద్యః |
| నదీమ్ | నద్యౌ | నదీః |
| నద్యా | నదీభ్యామ్ | నదీభిః |
| నద్యై | నదీభ్యామ్ | నదీభ్యః |
| నద్యాః | నదీభ్యామ్ | నదీభ్యః |
| నద్యాః | నద్యోః | నదీనామ్ |
| నద్యామ్ | నద్యోః | నదీషు |
| హే నది | హే నద్యౌ | హే నద్యః |

అభ్యాసము :

అటవీ, కుమారీ, గౌరి, గృహిణీ, జననీ, జగతీ, ధాత్రీ, నగ వారీ, పత్నీ, పృథివీ, భగినీ, భోగావతీ, మహతీ, మహిషీ, యువతీ, రా లేఖినీ, వాణీ, శ్రేణీ, హంసీ, తంత్రీ మొదలగునవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| స్త్రీ | స్త్రియౌ | స్త్రియః | శ్రీః | శ్రియౌ | శ్రియః |
| స్త్రియమ్ స్త్రీః | స్త్రియౌ | స్త్రియః, స్త్రీః | శ్రియమ్ | .. | .. |
| స్త్రియా | స్త్రీభ్యామ్ | స్త్రీభిః | శ్రియా | శ్రీభ్యామ్ | శ్రీభిః |
| స్త్రియై | .. | స్త్రీభ్యః | శ్రియై | .. | శ్రీభ్యః |
| స్త్రియాః | .. | .. | శ్రియాః | .. | .. |
| స్త్రియాః | స్త్రియోః | స్త్రీణామ్ | శ్రియః | శ్రియోః | శ్రీణామ్ |
| స్త్రియమ్ | స్త్రియోః | స్త్రీషు | శ్రియామ్ | శ్రియోః | శ్రీషు |
| హే స్త్రి | హే స్త్రియౌ | హే స్త్రియః | హే శ్రీః | హే శ్రియౌ | హే శ్రియః |

ఉకారాంత పుంలింగ 'భాను' శబ్దము—సూర్యుడు

| | | |
|---|---|---|
| భానుః | భానూ | భానవః |
| భానుమ్ | భానూ | భానూన్ |
| భానునా | భానుభ్యామ్ | భానుభిః |
| భానవే | భానుభ్యామ్ | భానుభ్యః |
| భానోః | భానుభ్యామ్ | భానుభ్యః |
| భానోః | భాన్వోః | భానూనామ్ |
| భానౌ | భాన్వోః | భానుషు |
| హే భానో | హే భానూ | హే భానవః |

అభ్యాసము :

గురు, వాయు, సాధు, వేణు, హేతు, అణు, అంశు, ఇందు, ఉరు, ఋతు, కృపాలు, కేతు, క్రతు, చరు, చిత్రభాను, జంతు, తంతు, తరు, ధూమకేతు, పరశు, పశు, ప్రభు, బంధు, బాహు, బింధు, భిక్షు, మను, మన్యు, మరు, మృత్యు, మృదు, మేరు, రేణు, విభు, విష్ణు, శత్రు, శంభు మొదలగునవి.

ఉకారాంత స్త్రీలింగ 'ధేను' శబ్దము:—ఆవు

| | | |
|---|---|---|
| ధేనుః | ధేనూ | ధేనవః |
| ధేనుమ్ | ధేనూ | ధేనూః |
| ధేన్వా | ధేనుభ్యామ్ | ధేనుభిః |
| ధేన్వై—ధేనవే | ధేనుభ్యామ్ | ధేనుభ్యః |
| ధేన్వాః—ధేనోః | ధేనుభ్యామ్ | ధేనుభ్యః |
| ధేన్వాః—ధేనోః | ధేన్వోః | ధేనూనామ్ |
| ధేన్వామ్—ధేనౌ | ధేన్వోః | ధేనుషు |
| హే ధేనో | హే ధేనూ | హే ధేనవః |

అభ్యాసము :

తను, రజ్జు, రేణు, చంచు, హను.

ఉకారాంత నపుంసక 'మధు' శబ్దము—తేనె

| | | |
|---|---|---|
| మధు | మధునీ | మధూని |
| మధు | మధునీ | మధూని |
| మధునా | మధుభ్యామ్ | మధుభిః |
| మధునే | మధుభ్యామ్ | మధుభ్యః |
| మధునః | మధుభ్యామ్ | మధుభ్యః |
| మధునః | మధునోః | మధూనామ్ |
| మధుని | మధునోః | మధుషు |
| హే మధో, హే మధు | హే మధునీ | హే మధూని |

అభ్యాసము :

అంబు, ఉరు, జంతు, జాను, వసు, తాలు, దారు, మరు మొద లగునవి.

ఊకారాంత స్త్రీలింగ 'వధూ' శబ్దము—వధువు.

| | | |
|---|---|---|
| వధూః | వధ్వౌ | వధ్వః |
| వధూమ్ | వధ్వౌ | వధూః |
| వధ్వా | వధూభ్యామ్ | వధూభిః |
| వధ్వై | వధూభ్యామ్ | వధూభ్యః |
| వధ్వాః | వధూభ్యామ్ | వధూభ్యః |
| వధ్వాః | వధ్వోః | వధూనామ్ |
| వధ్వామ్ | వధ్వోః | వధూషు |
| హే వధు | హే వధ్వౌ | హే వధ్వః |

అభ్యాసము :

తనూ, చంపూ, ప్రసూ, వీరసూ, శ్వశ్రూ, కర్కంధూ, బ్రహ్మ బంధూ మొదలగునవి.

ఋకారాంత పుంలింగ "ధాతృ" - బ్రహ్మ "మరియు" పితృ తండ్రి — శబ్దములు:

| | | |
|---|---|---|
| ధాతా | ధాతారౌ | ధాతారః |
| ధాతారమ్ | ధాతారౌ | ధాతౄన్ |
| ధాత్రా | ధాతృభ్యామ్ | ధాతృభిః |
| ధాత్రే | ధాతృభ్యామ్ | ధాతృభ్యః |
| ధాతుః | ధాతృభ్యామ్ | ధాతృభ్యః |
| ధాతుః | ధాత్రోః | ధాతౄణామ్ |
| ధాతరి | ధాత్రోః | ధాతృషు |
| హే ధాతః | హే ధాతారౌ | హే ధాతారః |

అభ్యాసము:

కర్తృ, జేతృ, ద్రష్టృ, శ్రోతృ, సవితృ, స్రష్టృ, హంతృ మొదలగునవి.

| | | |
|---|---|---|
| పితా | పితరౌ | పితరః |
| పితరమ్ | పితరౌ | పితౄన్ |
| పిత్రా | పితృభ్యామ్ | పితృభిః |
| పిత్రే | పితృభ్యామ్ | పితృభ్యః |
| పితుః | పితృభ్యామ్ | పితృభ్యః |
| పితుః | పిత్రోః | పితౄణామ్ |
| పితరి | పిత్రోః | పితృషు |
| హే పితః | హే పితరౌ | హే పితరః |

అభ్యాసము:

భ్రాతృ, జామాతృ, దేవృ, నృ, సవ్యేష్ఠృ మొదలగునవి.

ఋకారాంత స్త్రీలింగ "మాతృ" శబ్దము—తల్లి

| | | |
|---|---|---|
| మాతా | మాతరౌ | మాతరః |
| మాతరమ్ | మాతరౌ | మాతౄః |
| మాత్రా | మాతృభ్యామ్ | మాతృభిః |
| మాత్రే | మాతృభ్యామ్ | మాతృభ్యః |
| మాతుః | మాతృభ్యామ్ | మాతృభ్యః |
| మాతుః | మాత్రోః | మాతౄణామ్ |
| మాతరి | మాత్రోః | మాతృషు |
| హే మాతః | హే మాతరౌ | హే మాతరః |

అభ్యాసము.

దుహితృ, ననాంద్రృ, యాతృ మొదలగునవి.

ఐకారాంత పుంలింగ "రై" శబ్దము.

| | | |
|---|---|---|
| రాః | రాయౌ | రాయః |
| రాయమ్ | ,, | ,, |

| | | |
|---|---|---|
| రాయా | రాభ్యామ్ | రాభిః |
| రాయే | ,, | రాభ్యః |
| రాయః | ,, | ,, |
| రాయః | రాయోః | రాయామ్ |
| రాయి | ,, | రాసు |

ఓకారాంత పుంలింగ, స్త్రీలింగములో సమానమైన "గోః" శబ్దము-వృషభము

| | | |
|---|---|---|
| గౌః | గావౌ | గావః |
| గామ్ | గావౌ | గాః |
| గవా | గోభ్యామ్ | గోభిః |
| గవే | గోభ్యామ్ | గోభ్యః |
| గోః | గోభ్యామ్ | గోభ్యః |
| గోః | గవోః | గవామ్ |
| గవి | గవోః | గోషు |
| హే గౌః | హే గావౌ | హే గావః |

అభ్యాసార్థము :- సుద్యోః. స్మలత్యోః మొదలగునవి.

ఔకారాంత స్త్రీలింగ "నౌ" శబ్దరూపము

| | | |
|---|---|---|
| నౌః | నావౌ | నావః |
| నావమ్ | నావౌ | నావః |
| నావా | నౌభ్యామ్ | నౌభిః |
| నావే | నౌభ్యామ్ | నౌభ్యః |
| నావః | నౌభ్యామ్ | నౌభ్యః |
| నావః | నావోః | నావామ్ |
| నావి | నావోః | నౌషు |

### హలంత పుంలింగ "రాజన్" శబ్దము—రాజు

| | | |
|---|---|---|
| రాజా | రాజానౌ | రాజానః |
| రాజానమ్ | రాజానౌ | రాజ్ఞః |
| రాజ్ఞా | రాజభ్యామ్ | రాజభిః |
| రాజ్ఞే | రాజభ్యామ్ | రాజభ్యః |
| రాజ్ఞః | రాజభ్యామ్ | రాజభ్యః |
| రాజ్ఞః | రాజ్ఞోః | రాజ్ఞామ్ |
| రాజ్ఞి, రాజని | రాజ్ఞోః | రాజసు |
| హే రాజన్ | హే రాజానౌ | హే రాజానః |

### హలంత-పుంలింగ "పథిన్" శబ్దము-దారి

| | | |
|---|---|---|
| పంథాః | పంథానౌ | పంథానః |
| పంథానమ్ | పంథానౌ | పథః |
| పథా | పథిభ్యామ్ | పథిభిః |
| పథే | పథిభ్యామ్ | పథిభ్యః |
| పథః | పథిభ్యామ్ | పథిభ్యః |
| పథః | పథోః | పథామ్ |
| పథి | పథోః | పథిషు |
| హే పంథాః | హే పంథానౌ | హే పంథానః |

### హలంత పుంలింగ "యువన్" శబ్దము.

| | | |
|---|---|---|
| యువా | యువానౌ | యువానః |
| యువానమ్ | యువానౌ | యూనః |
| యూనా | యువభ్యామ్ | యువభిః |
| యూనే | యువభ్యామ్ | యువభ్యః |
| యూనః | యువభ్యామ్ | యువభ్యః |

| | | |
|---|---|---|
| యూనః | యూనోః | యూనామ్ |
| యూని | యూనోః | యువసు |

హలంత పుంలింగ "విద్వస్" శబ్దము

| | | |
|---|---|---|
| విద్వాన్ | విద్వాంసౌ | విద్వాంసః |
| విద్వాంసమ్ | విద్వాంసౌ | విదుషః |
| విదుషా | విద్వద్భ్యామ్ | విద్వద్భిః |
| విదుషే | విద్వద్భ్యామ్ | విద్వద్భ్యః |
| విదుషః | విద్వద్భ్యామ్ | విద్వద్భ్యః |
| విదుషః | విదుషోః | విదుషామ్ |
| విదుషి | విదుషోః | విద్వత్సు |
| హే విద్వన్ | హే విద్వాంసౌ | హే విద్వాంసః |

హలంత పుంలింగ శబ్దము "మరుత్" రూపము—గాలి

మరుత్_మరుద్ మరుతౌ మరుతః

మరుతమ్ ,, ,,

మరుతా మరుద్భ్యామ్ మరుద్భిః అభ్యాసము: హరిత్,

మరుతే ,, మరుద్భ్యః రోహిత్, తృపత్,

మరుతః ,, ,, వేహత్, వాచ్.

,, మరుతోః మరుతామ్ మొదలగునవి.

మరుతి మరుతోః మరుత్సు

హే మరుత్ హే మరుతౌ హే మరుతః

హలంత స్త్రీలింగ "సరట్" "గీర్ (వాక్కు) శబ్దములు

సరట్_సరడ్ సరటౌ సరటః గీః గిరౌ గిరః

సరటమ్ ,, ,, గిరమ్ ,, ,,

| | | | | | |
|---|---|---|---|---|---|
| సరటా | సరడ్భ్యామ్ | సరడ్భిః | గిరా | గీర్భ్యామ్ | గీర్భిః |
| సరటే | ,, | సరడ్భ్యః | గిరే | ,, | గీర్భ్యః |
| సరటః | ,, | ,, | గిరః | ,, | ,, |
| సరటః | సరటోః | సరటామ్ | గిరః | గిరోః | గిరామ్ |
| సరటి | ,, | సరట్సు | గిరి | గిరోః | గీర్షు |
| హే సరట్ | హే సరటౌ | హే సరటః | | | |

హలంత నపుంసకలింగ "యజుస్" శబ్దము

| | | |
|---|---|---|
| యజుః | యజుషీ | యజూంషి |
| ,, | ,, | ,, |
| యజుషా | యజుర్భ్యామ్ | యజుర్భిః |
| యజుషే | ,, | యజుర్భ్యః |
| యజుషః | ,, | ,, |
| ,, | యజుషోః | యజుషామ్ |
| యజుషి | ,, | యజుఃషు. |

హలంత నపుంసక "జ్యోతిస్" శబ్దము

| | | |
|---|---|---|
| జ్యోతిః | జ్యోతిషీ | జ్యోతీంషి |
| జ్యోతిః | ,, | ,, |
| జ్యోతిషా | జ్యోతిర్భ్యామ్ | జ్యోతిర్భిః |
| జ్యోతిషే | ,, | జ్యోతిర్భ్యః |
| జ్యోతిషః | ,, | ,, |
| జ్యోతిషః | జ్యోతిషోః | జ్యోతిషామ్ |
| జ్యోతిషి | ,, | జ్యోతిఃషు |

హలంత "అష్టన్" శబ్దము నిత్య బహువచనము మరియు మూడు లింగములలో సమానముగా నేర్పడును.

1. అష్టౌ–అష్ట.
2. ,, ,,
3. అష్టాభిః – అష్టభిః
4. అష్టాభ్యః – అష్టభ్యః
5. ,, ,,
6. అష్టానామ్
7. అష్టాసు–అష్టసు.

అభ్యాసము :—

సప్తన్, నవన్, దశన్ మొదలగునవి.

---

## 7. సర్వనామముల ప్రకరణము

భూపాలః సాయం ప్రాతః పుస్తకాని పఠతి, మధ్యాహ్నే చ స శాలాం గచ్ఛతి, తస్య మిత్రాణి తేన సహ పఠంతి = భూపాలుడు ప్రాతః సాయంకాలము పుస్తకములు చదువును. మరియు మధ్యాహ్నము అతడు బడికి వెళ్లును. అతని మిత్రులు అతనితో చదువుదురు.

పై వాక్యమునందు అతడు, అతని, అతనితో అను పదములు భూపాలుని గూర్చి చెప్పబడినవి. ఈ పదములను వాడక భూపాలునినే అన్ని స్థలములయందు ప్రయోగించి యుండిన, ఉదా:- మధ్యాహ్నేచ భూపాలః శాలాం గచ్ఛతి, భూపాలస్య మిత్రాణి భూపాలేన సహ పఠంతి అని వ్రాయవలసి వచ్చును. ఇది వినుటకు సొంపుగాను, మధురముగాను

నుండదు. అందుచే పునరావృత్తి చేయక సంజ్ఞా| స్థానమందు సః, తస్య, తేన మొదలగు వానిని వాడుదురు. ఇట్టి వానిని సర్వనామము లందురు.

## సర్వనామము యొక్క పరిభాష

వాక్యమునందు సంజ్ఞా శబ్దమును పునరావృత్తి జేయక సంజ్ఞకు బదులుగా అదే అర్థమును తెలిపెడి పదప్రయోగమును సర్వనామమందురు. సుమారు సర్వనామములు 38 గలవు. ఉదా:—

సర్వ = సర్వము (అన్నియును)
విశ్వ = విశ్వము ( ,, )
ఉభయ = ఇద్దరు (రెండు)
కతర = ఇద్దరిలో నెవరు
కతమ = అందరిలో నొకరు
అన్య = ఇతరుడు
అన్యతర = ఇద్దరిలో ఒకడు
అన్యతమ = అందరిలో నొకడు
ఇతర = వేరొకటి
ఇయత్ = ఇంత
త్వత్ = మరొకటి
త్వ = రెండవది
యావత్ = ఎంత
యుష్మద్ = నీవు

నేమ = అర్ధభాగము
సమ = సమము
సిమ = మొత్తము
పూర్వ = పూర్వదిశ (తూర్పు)
పర = మొదటిది
ఉత్తర = తరువాత
భవత్ = మీరు
అస్మద్ = నేను
అపర = రెండవది, తరువాత
యాదృశ్ = ఎట్టి
అధర = క్రిందిది
స్వ = తాను
ఆత్మన్ = తాను
అంతర = బయటి
త్య = అది; తావత్ = అంత
తద్ = అతడు అది (కండ్లకు కనిపించనిది)
ఏతద్ = ఇది(ఈ); ఏతావత్ = ఇంత

| | |
|---|---|
| యద్ = ఏది (సంబంధార్థకము) | అదస్ = ఈ |
| ఇదమ్ = ఈ; ఇది | ద్వి = రెండు |
| ఏక = ఒకటి | కీదృశ్ = ఎట్టి |
| కియత్ = ఎంత | కిమ్ = ఏమిటి (ప్రశ్నార్థకము) |

వీనిలో ముఖ్యమైనవి__ సర్వ, తద్, ఏతద్, యద్, కిమ్, ఇదమ్, అదస్, యుష్మద్, అస్మద్ మొదలగునవి సర్వనామ రూపములు మూడు లింగములలో నుండును. వాని విభక్తి ప్రత్యయములీ విధముగా నుండును:

| పురుషలింగ ప్రత్యయములు | | | స్త్రీలింగ ప్రత్యయములు | | |
|---|---|---|---|---|---|
| న్ | ఔ | ఈ | ,, | ఈ | అస్ |
| మ్ | ఔ | న్ | అమ్ | ఈ | అస్ |
| ఇన | భ్యామ్ | ఐస్ | ఆ | భ్యామ్ | భిస్ |
| స్మై | ,, | భ్యస్ | స్యై | ,, | భ్యస్ |
| స్మాత్ | ,, | ,, | స్యాస్ | ,, | ,, |
| స్య | ఓస్ | షామ్ | ,, | ఓస్ | సామ్ |
| స్మిన్ | ,, | షు | స్యామ్ | ,, | సు |

(సర్వనామములకు సంబోధనముండదు)

నపుంసక లింగము

| | | |
|---|---|---|
| మ్ | ఈ | ఆని |
| మ్ | ఈ | ఆని (తక్కిన విభక్తులు పుల్లింగమువలె యుండును.) |

పుల్లింగమున 'సర్వ' శబ్దరూపము

| | | |
|---|---|---|
| సర్వః | సర్వౌ | సర్వే |
| సర్వమ్ | సర్వౌ | సర్వాన్ |

| | | |
|---|---|---|
| సర్వేణ | సర్వాభ్యామ్ | సర్వైః |
| సర్వస్మై | ,, | సర్వేభ్యః |
| సర్వస్మాత్ | ,, | ,, |
| సర్వస్య | సర్వయోః | సర్వేషామ్ |
| సర్వస్మిన్ | ,, | సర్వేషు |

స్త్రీలింగమున సర్వ 'శబ్ద' రూపము

| | | |
|---|---|---|
| సర్వా | సర్వే | సర్వాః |
| సర్వామ్ | ,, | ,, |
| సర్వయా | సర్వాభ్యామ్ | సర్వాభిః |
| సర్వస్యై | ,, | సర్వాభ్యః |
| సర్వస్యాః | ,, | ,, |
| ,, | సర్వయోః | సర్వాసామ్ |
| సర్వస్యామ్ | ,, | సర్వాసు |

పుంలింగమున 'తద్' శబ్దరూపము స్త్రీలింగమున 'తద్' శబ్ద రూ.

| | | | | | |
|---|---|---|---|---|---|
| సః | తౌ | తే | సా | తే | తాః |
| తమ్ | ,, | తాన్ | తామ్ | ,, | ,, |
| తేన | తాభ్యామ్ | తైః | తయా | తాభ్యామ్ | తాభిః |
| తస్మై | ,, | తేభ్యః | తస్యై | ,, | తాభ్యః |
| తస్మాత్ | ,, | ,, | తస్యాః | ,, | ,, |
| తస్య | తయోః | తేషామ్ | తస్యాః | తయోః | తాసామ్ |
| తస్మిన్ | తయోః | తేషు | తస్యామ్ | తయోః | తాసు |

నపుంసక లింగమున 'తద్' శబ్దరూపము

తద్ తే తాని

తద్ తే తాని (తక్కినవి పులింగమువలె)

## 'ఏతద్' శబ్దరూపము

| పుంలింగము | | | స్త్రీలింగము | | |
|---|---|---|---|---|---|
| ఏషః | ఏతౌ | ఏతే | ఏషా | ఏతె | ఏతాః |
| ఏతమ్ | ఏతౌ_ | ఏతాన్_ | ఏతామ్_ | ఏతే_ | ఏతా_ |
| ఏనమ్ | ఏనౌ | ఏనాన్ | ఏనామ్ | ఏనే | ఏనాః |
| అనేన_ ఏనేన | ఏతాభ్యామ్_ | ఏతైః_ | ఏతయా_ ఏనయా | ఏతాభ్యాం | ఏతాభిః, |
| ఏతస్మై | ,, | ఏతేభ్యః | ఏతస్యై | ఏతాభ్యాం | ఏతాభ్యః |
| ఏతస్మాత్ | ,, | ,, | ఏతస్యాః | ,, | ,, |
| ఏతస్య | ఏతయో_ఏనయో | ఏతేషామ్ | ,, | ఏతయోః_ఏనయోః | ఏతాసామ్ |
| ఏతస్మిన్ | ,, | ఏతేషు | ఏతస్యామ్ | ,, | ఏతాసు |

## నపుంసకము 'ఏతద్' శబ్దరూపము

| | | |
|---|---|---|
| ఏతద్ | ఏతే | ఏతాని |
| ఏతద్ | ఏతే | ఏతాని (మిగిలినవి పుంలింగమువలె) |

## 'యద్' శబ్దరూపము

| పుంలింగము | | | స్త్రీలింగము | | |
|---|---|---|---|---|---|
| యః | యౌ | యే | యా | యే | యాః |
| యమ్ | ,, | యాన్ | యామ్ | ,, | ,, |
| యేన | యాభ్యామ్ | యైః | యయా | యాభ్యామ్ | యాభిః |
| యస్మై | ,, | యేభ్యః | యస్యై | ,, | యాభ్యః |
| యస్మాత్ | ,, | ,, | యస్యాః | ,, | ,, |
| యస్య | యయోః | యేషామ్ | ,, | యయోః | యాసామ్ |
| యస్మిన్ | యయోః | యేషు | యస్యామ్ | ,, | యాసు |

నపుంసక లింగమున 'యద్' శబ్దరూపము.

| | | |
|---|---|---|
| యద్ | యే | యాని |
| యద్ | యే | యాని |

(తక్కినవి పుంలింగమువలె)

'కిమ్' శబ్దరూపము

పుంలింగము

| | | |
|---|---|---|
| కః | కౌ | కే |
| కమ్ | కౌ | కాన్ |
| కేన | కాభ్యామ్ | కైః |
| కస్మై | ,, | కేభ్యః |
| కస్మాత్ | ,, | ,, |
| కస్య | కయోః | కేషామ్ |
| కస్మిన్ | ,, | కేషు |

స్త్రీలింగము

| | | |
|---|---|---|
| కా | కే | కాః |
| కామ్ | కే | కాః |
| కయా | కాభ్యామ్ | కాభిః |
| కస్యై | ,, | కాభ్యః |
| కస్యాః | ,, | ,, |
| ,, | కయోః | కాసామ్ |
| కస్యామ్ | ,, | ,, సు |

నపుంసకమున 'కిమ్' శబ్ద రూపము

| | | |
|---|---|---|
| కిమ్ | కే | కాని |
| కిమ్ | కే | కాని (తక్కినవి పు. వలె) |

## 'ఇదమ్' శబ్ద రూపము

### పుంలింగము

| | | |
|---|---|---|
| అయమ్ | ఇమౌ | ఇమే |
| ఇమమ్ | ఇమౌ | ఇమాన్ |
| అనేన | ఆభ్యామ్ | ఏభిః |
| అస్మై | ,, | ఏభ్యః |
| అస్మాత్ | ,, | ,, |
| అస్య | అనయోః | ఏషామ్ |
| అస్మిన్ | ,, | ఏషు |

### స్త్రీలింగము

| | | |
|---|---|---|
| ఇయమ్ | ఇమే | ఇమాః |
| ఇమామ్ | ఇమే | ఇమాః |
| అనయా | ఆభ్యామ్ | ఆభిః |
| అస్యై | ,, | ఆభ ః |
| అస్యాః | ,, | ,, |
| అస్యాః | అనయోః | ఆసామ్ |
| అస్యామ్ | ,, | ఆసు |

## నపుంసకమున "ఇదమ్" శబ్దరూపము

| | | |
|---|---|---|
| ఇదమ్ | ఇమే | ఇమాని |
| ఇద | ఇమే | ఇమాని |

(తక్కినవి పుంలింగమువలె)

## 'అదస్' శబ్దరూపము

### పుంలింగము

| | | |
|---|---|---|
| అసౌ | అమూ | అమీ |
| అముమ్ | ,, | అమూన్ |

| | | |
|---|---|---|
| అమునా | అమూభ్యామ్ | అమీభిః |
| అముష్మై | ,, | అమీభ్యః |
| అముష్మాత్ | ,, | ,, |
| అముష్య | అముయోః | అమీషామ్ |
| అముష్మిన్ | ,, | అమీషు |

స్త్రీలింగము

| | | |
|---|---|---|
| అసౌ | అమూ | అమూః |
| అమూమ్ | ,, | ,, |
| అముయా | అమూభ్యామ్ | అమూభిః |
| అముష్యై | ,, | అమూభ్యః |
| అముష్యాః | ,, | ,, |
| ,, | అముయోః | అమూషామ్ |
| అముష్యామ్ | ,, | అమూషు |

నపుంసకము 'అదస్' శబ్దరూపము

| | | |
|---|---|---|
| అదః | అమూ | అమూని |
| అదః | అమూ | అమూని |

(మిగిలినవి పుంలింగమువలె.)

'యుష్మద్' శబ్దరూపము

మూడు లింగములు ఒకే లాగుండును.

| | | |
|---|---|---|
| త్వమ్ | యువామ్ | యూయమ్ |
| త్వామ్–త్వా | యువామ్–వామ్ | యుష్మాన్–వః |
| త్వయా | యువాభ్యామ్ | యుష్మాభిః |
| తుభ్యమ్–తే | ,, | యుష్మభ్యమ్–వః |

| | | |
|---|---|---|
| త్వత | యువాభ్యామ్ | యుష్మత్ |
| తవ_తే | యువయోః_వామ్ | యుష్మాకమ్_వః |
| త్వయి | యువయోః | యుష్మాసు |

'అస్మద్' శబ్దరూపము

మూడు లింగములలో ఒకేలాగునుండును.

| | | |
|---|---|---|
| అహమ్ | ఆవామ్ | వయమ్ |
| మామ్_మా | ఆవామ్_నౌ | అస్మాన్_నః |
| మయా | ఆవాభ్యామ్ | అస్మాభిః |
| మహ్యమ్_మే | ఆవాభ్యామ్_నౌ | అస్మభ్యమ్_నః |
| మత్ | అవాభ్యామ్ | అస్మత్ |
| మమ_మే | ఆవయోః_నౌ | అస్మాకమ్_నః |
| మయి | ఆవయోః | అస్మాసు |

'ఉభ' శబ్దరూపము

ఇది ద్వివచనములో మాత్రమే యుండును.

మూడు లింగములలో ఈ క్రింది విధముగానుండును.

| పురుష | స్త్రీ | న. |
|---|---|---|
| ఉభౌ | ఉభే | ఉభే |
| ,, | ,, | ,, |
| ఉభాభ్యామ్ | ఉభాభ్యామ్ | ఉభాభ్యామ్ |
| ,, | ,, | ,, |
| ,, | ,, | ,, |
| ఉభయోః | ఉభయోః | ఉభయోః |
| ,, | ,, | ,, |

## అకారాంతమైన 'ఏక' శబ్దరూపము

### పుంలింగము

| | | |
|---|---|---|
| ఏకః | ఏకౌ | ఏకే |
| ఏకమ్ | ,, | ఏకాన్ |
| ఏకేన | ఏకాభ్యామ్ | ఏకైః |
| ఏకస్మై | ఏకాభ్యామ్ | ఏకేభ్యః |
| ఏకస్మాత్ | ,, | ,, |
| ఏకస్య | ఏకయోః | ఏకేషామ్ |
| ఏకస్మిన్ | ,, | ఏకేషు |

### స్త్రీలింగము

| | | |
|---|---|---|
| ఏకా | ఏకే | ఏకాః |
| ఏకామ్ | ,, | ,, |
| ఏకాయా | ఏకాభ్యామ్ | ఏకాభిః |
| ఏకస్యై | ,, | ఏకాభ్యః |
| ఏకస్యాః | ,, | ,, |
| ,, | ఏకయోః | ఏకాసామ్ |
| ఏకస్యామ్ | ,, | ఏకాసు |

### నపుంసకమున 'ఏక' శబ్దరూపము

| | | |
|---|---|---|
| ఏకమ్ | ఏకే | ఏకాని |
| ఏకమ్ | ఏకే | ఏకాని |

(తక్కినవి పుంలింగములోవలె.)

## మూడు లింగములలో 'ద్వి' శబ్దరూపము

ఇదియు ఉభ శబ్దమువలె నిత్య ద్వివచనాన్త రూపము. ఏక బహు వచనములుండవు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| పు. | ద్వౌ | ద్వౌ | ద్వాభ్యామ్ | ద్వాభ్యామ్ | ద్వాభ్యామ్ | ద్వయోః | ద్వయోః |
| స్త్రీ. | ద్వే | ద్వే | ,, | ,, | ,, | ,, | ,, |
| న. | (స్త్రీలింగమువలె) | | | | | | |

'త్రి' శబ్దరూపము

ఇది నిత్య బహు వచనాంతము. ఏకద్వి వచనములుండవు.

| | పు. | స్త్రీ. | న. |
|---|---|---|---|
| ప్రథమ | త్రయః | తిస్రః | త్రీణి |
| ద్వితీయ | త్రీన్ | తిస్రః | ,, |
| తృతీయ | త్రిభిః | తిసృభిః | త్రిభిః |
| చతుర్థీ | త్రిభ్యః | తిసృభ్యః | త్రిభ్యః |
| పంచమీ | త్రిభ్యః | ,, | ,, |
| షష్ఠీ | త్రయాణామ్ | తిసృణామ్ | త్రయాణామ్ |
| సప్తమీ | త్రిషు | తిసృషు | త్రిషు |

'చతుర్' శబ్దరూపము

ఇదియు నిత్య బహువచనాంతము.

| పు. | స్త్రీ. | నపుం. |
|---|---|---|
| చత్వారః | చతస్రః | చత్వారి |
| చతురః | ,, | ,, |
| చతుర్భిః | చతసృభిః | చతుర్భిః |
| చతుర్భ్యః | చతసృభ్యః | చతుర్భ్యః |
| ,, | ,, | ,, |
| చతుర్ణామ్ | చతసృణామ్ | చతుర్ణామ్ |
| చతుర్షు | చతసృషు | చతుర్షు |

మూడులింగములలో సమానమైన 'పఞ్చన్' శబ్దరూపము.

పఞ్చ. పఞ్చ. పఞ్చభిః, పఞ్చభ్యః, పఞ్చభ్యః, పఞ్చానామ్, పఞ్చసు

## 8. ఉపసర్గల ప్రకరణము

ధాతువులకు పూర్వము ఉపసర్గలు చేర్చబడును. ఈ ఉపసర్గల యొక్క కలయికచేత ధాతువునకు అనేకార్థములేర్పడును. ఉదా:-భూధాతువునకు కొన్ని రకముల ఉపసర్గలు చేరుటవలన అద్దాని అర్థము ఏలాగున ఏర్పడునో చూసెదము. ఉపసర్గల స్వతంత్ర ప్రయోగము జరుగకున్నను వాని యర్థము దేనిని తెలుపునో ఆ ఉపసర్గలను మరియు వాని యర్థము వ్రాసి తర్వాత భూధాతువుయొక్క కలయికచేత నేర్పడు యర్థము చెప్పబడును. ఉపసర్గలు సుమారు 22 ఉన్నవి.

1. ప్ర = ప్రకర్ష, అధికముగా
2. పరా = ఉత్కర్ష, అపకర్ష, విరుద్ధముగా, వ్యతిరేకముగా.
3. అప = అపకర్ష, వియోగము, వికారము, చెడుపు, హీనము
4. సమ్ = ఐక్యము, వెంట, ఉత్తమమైన, పూర్ణమైన, సంగమమైన.
5. అను = తదుపరి, తుల్యమైన, క్రమమైన, అనుకూలమైన
6. అవ = క్రింద, నింద, అభావము
7. నిస్ = నిషేదము, నిశ్చయము, హీనమైన
8. నిర్ ,, ,, ,,
9. దుస్ = దుష్టత
10. దుర్ = దుర్గతి
11. వి = విశేషము, భిన్నముగా, అభావముగా
12. ఆజ్ = సమేతము
13. అధి = పైన, ఐశ్వర్యము

14. అవ = శంక, నింద, క్రింద, ముందర

15. అతి = అధికము, అతిశయము

16. సు = సహజముగా, ఉత్తమమైన

17. ఉత్, ఉద్ = పైన, ఎత్తున, శ్రేష్ఠమైన

18. అభి = వైపు, దగ్గర, ముందర

19. ప్రతి = విరుద్ధము, ముందర, ఒకటి

20. పరి = నాలుగు వైపుల, పూర్ణముగా, దగ్గరగా

21. ఉప = సమీపమున, గౌణముగా

22. ని = లోపల, క్రింద.

భూధాతువునకు ఉపసర్గల చేర్చిన తర్వాత ఏర్పడు యర్థము.

1. ప్ర + (భూ) = పెరుగుట, ప్రభవ = జన్మ. ప్రభావః = ప్రభావము, ప్రభు = స్వామి. ప్రభవతి
2. పరా + (భూ) = నాశనమగుట. పరాభవతి = ఓడిపోవుట
3. అప + (భూ) = అపభూతి = స్వరాజయము. అపభవతి
4. సమ్ + (భూ) = సంభవ = సంభవము, సంభూతి. సంభవతి
5. అను + (భూ) = అనుభవము. అనుభవతి
6. ఉద్ + (భూ) = ఉద్భవ, ఉత్పత్తి, పుట్టుట. ఉద్భవతి
7. ప్రతి + (భూ) = సమానమైన. ప్రతిభవతి
8. పరి + (భూ) = పరాభవము, అవమానము. పరిభవతి
9. ఉప + (భూ) = దగ్గరగా నుండుట. ఉపభవతి.

సంస్కృత శబ్దములలో కొన్ని కొన్ని విశేషణములు మరియు అవ్యయములు కూడ ఉపసర్గలవలె ప్రయోగించబడును. ఉదా:-
అ = అభావము, నిషేదము ఉదా:- అధర్మము, అజ్ఞానము, అనీతి

అధస్ = క్రింద ఉదా:- అధఃపతనము, అధోగతి, అధోభాగము

అంతర్ = లోపల ఉదా:- అంతఃపురము, అంతఃకరణము, అంతర్దశా

కు, కా, కద్ = చెడ్డది ఉదా:- కుకర్మ, కాపురుషుడు, కదాచారము

చిర = చాల ఉదా:- చిరాయు, చిరకాలము

న = అభావము ఉదా:- నపుంసకుడు, నాస్తికుడు.

పురస్ = ఎదుట ఉదా:- పురస్కారము, పురోహితుడు

పురా = మొదట ఉదా:- పురాతత్వము, పురాణము, పురాతనమైన

పునర్ = మరల ఉదా:- పునర్జన్మ, పునర్వివాహము

బహిర్ = బయట ఉదా:- బహిర్ద్వారము, బహిష్కారము

స = తోడుగా ఉదా:- సజీవము, సఫలము, సగోత్రము

సత్ = మంచిది ఉదా:- సత్కర్మ, సజ్జనుడు, సత్పాత్రుడు

స్వ = తన ఉదా:- స్వదేశము, స్వార్థము, స్వనామము

## సోపసర్గ ధాత్వర్థాః

(1) అయ గతౌ

అయతే = వెళ్లుచున్నాడు

ఉదయతే = పెరుగుచున్నాడు

దురయతే = దుఃఖించుచున్నాడు

దులయతే = కంపించుచున్నాడు

నిరయతే = బయటపడుచున్నాడు

పలాయతే = పలాయనుడగుచున్నాడు

విలాయతే = విలీనమగుచున్నాడు

వ్యయతే = వ్యయమగుచున్నది

(2) ఆస ఉపవేశనే

ఆస్తే = కూర్చున్నాడు

అధ్యాస్తే = ఉన్నాడు

అన్వాస్తే = వెనుక కూర్చున్నాడు

ఉదాస్తే = ఉదాసీనుడగుచున్నాడు

ఉపాస్తే = ధ్యానము చేయుచున్నాడు

(3) ఇణ్ గతౌ

ఏతి = వెళ్లుచున్నాడు

అత్యేతి = నష్టమగుచున్నది
అన్వేతి = వెనుక కలియుచున్నది
అపైతి = దూరమగుచున్నది
అభిప్రైతి = ఇష్టపడుచున్నది
అభ్యేతి = ముందు వచ్చుచున్నది
అవైతి = తెలిసికొనుచున్నది
ఉదైతి = ఉదయించుచున్నది
ఉపైతి = దగ్గరకు వెళ్లుచున్నది
ప్రత్యేతి = విశ్వసించుచున్నాడు
విపర్యేతి = తిరిగిపోవుచున్నాడు
వ్యత్యేతి = క్రింద-మీద చేయుచున్నది
వ్యేతి = సమన్వయము చేయుచున్నది
సమవైతి = సంబద్ధమగు చున్నది

4. కృఞ్ కరణే

కరోతి = చేయుచున్నాడు
అధికురుతే = క్షమాలేక పరాభవము చేయుచున్నాడు
అనుకరోతి = ఒకరు చేసినట్లు చేయుచున్నాడు
అపకరోతి = హాని చేయుచున్నాడు
అలంకరోతి = అలంకరించుచున్నాడు
అపాకరోతి = ఖండించు చున్నాడు
ఆవిష్కరోతి = ఆవిష్కరించు చున్నాడు
ఉత్కురుతే = సాడీలుచెప్పుచున్నాడు
ఉదాకురుతే = పట్టుకొనుచున్నాడు
ఉపకరోతి = ఉపకారము చేయుచున్నాడు
ఉపస్కురుతే = ఇతరుల గుణములు గ్రహించుచున్నాడు
తిరస్కరోతి = తిరస్కరించుచున్నాడు
నిరాకరోతి = నిరాకరించుచున్నాడు
పరిష్కరోతి = పరిష్కరించుచున్నాడు
ప్రకురుతే = బలవంతము చేయుచున్నాడు
ప్రతికరోతి = ప్రతీకారము చేయుచున్నాడు
ప్రత్యుపకరోతి = ప్రత్యుపకారము చేయుచున్నాడు
వికురుతే = వికారముచేయుచున్నాడు
సంస్కరోతి = సంస్కారము చేయుచున్నాడు

5. క్రము పాదవిక్షేపే

క్రామతి = నడుచు చున్నాడు
అతిక్రామతి = ఉల్లంఘించుచున్నాడు
అపక్రామతి = తొలగించుచున్నాడు
ఉపక్రమతే = ఆరంభించుచున్నాడు
నిష్క్రామతి = వెళ్లుచున్నాడు
పరిక్రామతి = పరిక్రమించుచున్నాడు

విక్రమతే = పరాక్రమించుచున్నాడు
సంక్రామతే = సంక్రమించుచున్నది

6. క్షిపే ప్రేరణే

క్షిపతి = పడవేయుచున్నాడు
అధః క్షిపతి = క్రింద పడవేయుచున్నాడు
అధిక్షిపతి = తిరస్కరించుచున్నాడు
ఆక్షిపతి = దూషించుచున్నాడు
ఉత్ క్షిపతి = పైకి వెళ్లుచున్నాడు
ప్రక్షిపతి = ప్రక్షేపించుచున్నాడు
విక్షిపతి = విక్షేపించుచున్నాడు
సంక్షిపతి = సంక్షేపించుచున్నాడు

7. గమ్లు గతౌ

గచ్ఛతి = వెళ్లుచున్నాడు
అధిగచ్ఛతి = పొందుచున్నాడు
అనుగచ్ఛతి = వెంబడించుచున్నాడు
అపగచ్ఛతి = దూరమగుచున్నాడు
అభ్యాగచ్ఛతి = ఎదురగుచున్నాడు
అభ్యుపగచ్ఛతి = స్వీకరించుచున్నాడు
అవగచ్ఛతి = తెలిసికొనుచున్నాడు
ఆగచ్ఛతి = వచ్చుచున్నాడు
ఉద్గచ్ఛతి = పైకి వెళ్లుచున్నాడు
నిర్గచ్ఛతి = బాయటికి వెళ్లుచున్నాడు
ప్రతిగచ్ఛతి = తిరిగి వచ్చుచున్నాడు
సంగచ్ఛతే = వెంబడించుచున్నాడు

8. చర గతిభక్షణయోః

చరతి = చరించుచున్నాడు నడచుచున్నాడు
అతిచరతి = అధిక గమనము చేయుచున్నాడు
అనుచరతి = అనుసరించుచున్నాడు
ఆచరతి = ఆచరించుచున్నాడు
ఉచ్చరతి = పైకి వెళ్లుచున్నాడు
ఉచ్చరతి = ఉల్లంఘించుచున్నాడు
ఉపచరతే = ఉపచారము చేయుచున్నాడు
దురాచరతి = దురాచారము చేయుచున్నాడు
పరిచరతి = పరిచర్య చేయుచున్నాడు
విచరతి = తిరుగుచున్నాడు
వ్యభిచరతి = వ్యభిచరించుచున్నాడు
సంచరతే = సంచరించుచున్నాడు

9. జ్ఞా అవబోధనే

జానాతి = తెలిసికొనుచున్నాడు
అనుజానాతి = అనుమతించుచున్నాడు
అపజానీతే = దాచిపెట్టుచునాన్నాడు
అభిజానాతి = గుర్తుపట్టుచున్నాడు

అభ్యనుజానాతి = స్వీకరించుచున్నాడు

ప్రతిజానీతే = ప్రతిజ్ఞాచేయుచున్నాడు

విజానాతి = తెలిసుకొనుచున్నాడు

సంజానీతే = చూచుచున్నాడు

10. ణీఞ్ ప్రాపణే

నయతి = తీసికొని వెళ్లుచున్నాడు

అనునయతి = ప్రార్థించుచున్నాడు

అపనయతి = తొలగించుచున్నాడు

అభినయతి = అభినయించుచున్నాడు

ఆనయతి = తెచ్చుచున్నాడు

ఉన్నయతే = పైకి తీసికొనివెళ్లుచున్నాడు

ఉపనయతి = దగ్గరకు తీసికొని వెళ్లుచున్నాడు

నిర్ణయతి = నిర్ణయించుచున్నాడు

పరిణయతి = వివాహమాడుచున్నాడు

ప్రణయతి = ప్రేమించుచున్నాడు

వినయతి = వినయముచూపుచున్నాడు

వినయతే = లెక్కించుచున్నాడు, ఖర్చుచేయుచున్నాడు

11. దిశ అతిసర్జనే

దిశతి = ఇచ్చుట, చూపుట

ఆదిశతి = ఆజ్ఞాయిచ్చుట

ఉపదిశతి = ఉపదేశించుట

నిర్దిశతి = నిర్దేశించుట

వ్యపదిశతి = ముఖ్యమైన వ్యవహారము చేయుట

సందిశతి = సందేశమిచ్చుట

12. పత్లృ పతనే

పతతి = పడుట

ఉత్పతతి = ఎగురుట

ప్రణి పతతి = ప్రణామము చేయుట

నిపతతి = పడుట

13. పద గతౌ

పద్యతే = వెళ్లుట

ఉత్పద్యతే = పుట్టించుట

ఉప పద్యతే = యుక్తము చేయుట

ప్రతి పద్యతే = ఆజ్ఞ యడుగుట

విపద్యతే = చచ్చుట

వ్యుత్పద్యతే = వ్యుత్పన్నమగుట

సంపద్యతే = ఆగుట, మారుట

14. బంధ బంధనే

బధ్నాతి = బంధించుట

ఉద్ బధ్నాతి = ఉరిపెట్టుట

నిబధ్నాతి = రచించుట

నిర్బధ్నాతి = ప్రేమించుట
ప్రతిబధ్నాతి = ప్రతిబంధించుట
ప్రబధ్నాతి = ప్రబంధము చేయుట
సంబధ్నాతి = కలుపుట

15. భూ సత్తాయామ్

భవతి = అగుట
అనుభవతి = అనుభవించుట
అంతర్భవతి = అంతర్ధానమగుట
ఆవిర్భవతి = ప్రకటమగుట
ఉద్భవతి = ఉత్పన్నమగుట
పరాభవతి = పరాభవించుట
పరిభవతి = తిరస్కరించుట
ప్రభవతి = కలుగుచున్నాడు
ప్రాదుర్భవతి = ప్రకటమగుట
సంభవతి = సంభవమగుట, పుట్టుట

16. మను అవబోధనే

మన్యతే = ఒప్పుకొనుట
అనుమన్యతే = సలహానిచ్చుట
అవమన్యతే = తిరస్కరించుట
విమన్యతే = ఉపేక్షించుట
సంమన్యతే = సమ్మానించుట

17. రుహ బీజ జన్మని

రోహతి = పేరుట, పేర్చుట
అధిరోహతి = ఎక్కుట
అవరోహతి = దిగుట
ఆరోహతి = ఎక్కుట
ప్రరోహతి = ఉత్పన్నమగుట
సంరోహతి = దొరకుట లేక కలియుట

18. లప లపనే

లపతి = చెప్పుట
అపలపతి = దాగియుండుట
ఆలపతి = చెప్పుట
ప్రలపతి = ప్రలపించుట. వృధా మాట్లాడుట
విలపతి = విలపించుట
సంలపతి = వార్తాలాపముచేయుట

19. వద వ్యక్తాయాం వాచి

వదతి = చెప్పుట
అనువదతి = అనువాదము చేయుట
అనువదతే = తుల్యముగా చెప్పుట
అపవదతి = దూషించుట
ఉపవదతే = ప్రార్థన చేయుట
ప్రతివదతే = జవాబు చెప్పుట
విప్రవదతే = విరుద్ధముగా చెప్పుట
వివదతే = వివాదముచేయుట
సంప్రవదతే = కలసి చెప్పుట
సంవదతి = మాట్లాడుట

